ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras.} Regd. No. M. 1118 Vol. 35 No. 231 WEDNESDAY 24th NOVEMBER 1948 వెల ఒక అణా {Founder: K. Nageswara Rao

# 'కాశ్మీరు సమస్యాపరిష్కారానికి పాకిస్తాన్ వైఖరే ప్రతిబంధకమైనది'

## ఐక్యరాజ్యసమితి ఉపసంఘ నివేదిక

### ప్రస్తుతపరిస్థితులలో జనవాక్య నిర్ధారణ సాధ్యంగాదని భద్రతామండలికి సూచన

ప్యారిసు, నవంబరు 22: కాశ్మీర్ సమస్య విషయములో ఇండియాకు, పాకిస్తానుకు కలిగిన వివాదమునుగూర్చి పరిశీలించి సలహాలను సూచించు నిమిత్తమై భద్రతామండలి నియమించిన కాశ్మీరు వ్యవహార విచారణసంఘము ఒక తాత్కాలికనివేదికను తయారుచేసి నేడు ప్రకటించినది.

భద్రతా మండలికి ఇదమిత్థమని ఏవిధమైన సలహాలను యీ తాత్కాలిక నివేదికలో సూచింపలేదు. కాశ్మీరులోను, జమ్మూలోను జనవాక్యనిర్ధారణ చేయుటకు, ప్రజల వోటింగు జరుపుటకు ప్రస్తుతము చిక్కులు అనేకముగా కలవని యీ నివేదికలో నొక్కివక్కాణింపబడెను.

కాశ్మీరులో యీ కమిటీ పర్యటనచేసి గ్రహించిన నిజసందర్భ పరిస్థితులను యీ కమిటీ క్రిందిరీతిగా వివరించెను.

ఈ కమిటీని నియమించుటకై భద్రతా మండలి తీర్మానము చేసినప్పుడు భద్రతా మండలియందు జరిగిన చర్చల సందర్భములో కాశ్మీరు వ్యవహారపరిస్థితులు ఒక విధముగా వర్ణింపబడెను. కాని, మేము కాశ్మీరు వెళ్లి చూడగా పరిస్థితులు మరొక రీతిగా నుండెను. పాకిస్తాను ప్రభుత్వసేనలే ప్రత్యక్షముగా అచట యుద్ధములో పాల్గొను చున్నవి. ఈ క్రొత్త సందర్భ పరిస్థితి మూలంగా యీ కమిటీయొక్క కర్తవ్య విధానము ఆ సందర్భానుగుణమైన మార్గమును త్రొక్కవలసి వచ్చినది. యుద్ధమును సద్యః విరమించుటకు కొన్ని షరతులను నిర్ణయించి ఆ షరతులకు పాకిస్తానున్నూ ఇండియా ప్రభుత్వమున్నూ అంగీకరించునట్లుగా చేయుటయే వ్యవహార పరిష్కారమునకు ప్రథమ సోపానముగా కన్పించెను.

యుద్ధరంగంలో పోరాటం నిలిపివేయవలెనని ఈ త్తరువును ఉభయసేనలకు జారీ చేయవలసినదిగా యీకమిటీ ముమ్మొందుగా కోరుచు ఒక తీర్మానము చేసెను. ఆ తీర్మానమును ఆమూలాగ్రముగా ఇండియా గవర్నమెంటు ఆమోదించెను. ఆ తీర్మానమును ఆమోదించుటకు పాకిస్తాన్ ప్రభుత్వము కొన్ని షరతులను సూచించెను. కాని ఆ షరతులు మా తీర్మానమునొక్క-

(8-వ పేజీ చూడుడు)

గ్రాస్ ఆక్రమణకు దోహదం చేసిన జాజిలా పోరాటమును స్వయంగా నడిపిన మేజర్ జనరల్ తిమ్మయ్య, లెఫ్టినెంట్ జనరల్ శ్రీ నగేష్ లెఫ్టినెంట్ జనరల్ కరియప్పగార్లు.

## కాశ్మీర్ రంగంలో భారత సేనల అద్భుతవిజయం

### పూంచ్‌లో శత్రువుకు విపరీత నష్టం

న్యూఢిల్లీ, నవంబరు 22: జమ్మూలోని తమస్థావరముల నుండి భారతీయ సైనికదళములు నవంబరు 7 వ తేదీరాత్రి బయలుదేరి గత శనివారమునాడు పూంఛ్‌లోని దళములను కలిసికొనినట్లు నేడు ప్రకటించబడెను.

ఈ కలయికకు కారణమేమన, పూంఛ్ రంగములో శత్రు సంరంభము రెండు మాసముల నుండియు తీవ్రముగా నుండి పూంఛ్ రంగమునకు సరఫరాలు అందుట దుష్కరముగా పరిణమించినది. ఆ శత్రు ఒత్తిడిని తగ్గించుటకు గాను పూంఛ్ రంగమును జమ్మూలోని సైనిక స్థావరములతో కలుపవలసివచ్చెను. పూంఛ్ వైపు వచ్చుచున్న భారతీయ దళములను శత్రువులు దారిపొడుగున ఎదిరించిరి. కాని మన విమానములు మన దళములను కాపాడుటయేకాక శత్రు ఫిరంగిస్థావరములను ధ్వంసము చేయుచు వచ్చెను. నవంబరు 8 మొదలు 14 లోపల సుమారు 340 మంది శత్రు సైనికులు నిహతులైరి.

### కాశ్మీర్ మాజీ ప్రధాని విడుదల

శ్రీనగర్, నవంబరు 22: పదివేలరూపాయిల జరిమానా రెండున్నర సంవత్సరముల జైలు విధింపబడిన కాశ్మీర్ మాజీ ప్రధాని రామచంద్ర కాక్‌ను ఈ సాయంకాలము జైలునుండి విడుదల చేసినట్లు, కాశ్మీర్ ప్రభుత్వం ప్రకటించెను. రామచంద్ర కాక్ కేసును పునర్విచారణ జరిపి, శిక్షాకాలమును రద్దు చేయుటకు ప్రభుత్వం నిశ్చయించుకొని, తత్ఫలితముగా 'కాక్'ను విడుదల చేసినట్లు, యీ ప్రకటనలో తెలుపబడెను.

### రాజకీయములను విడనాడ ముస్లిమ్‌లీగు నిర్ణయము

త్రివేండ్రమ్, నవంబరు 22: సంస్థానములో ఇక రాజకీయ కార్యకలాపములను విసర్జింప తిరువాన్కూరు సంస్థాన ముస్లిమ్ లీగువారు నిర్ణయించిరి. గతరాత్రి సంస్థాన ముస్లిములీగు ద్వితీయ వార్షిక సమావేశములో రాజకీయములను విడనాడు తీర్మానము 497-436 వోట్లచే ఆమోదింపబడెను. (అ. ప్రె.)

### అంతరధినివేశ సమావేశం

#### అయిదు విషయములపై సద్యః నిర్ణయములు

న్యూఢిల్లీ, నవంబరు 22: భారత, పాకిస్తాన్ ప్రభుత్వ కార్యదర్శుల సమావేశం నేడిచట ప్రారంభమైనది. చర్చాంశములలో 5 ఇంటర్ విషయములపై నేడు చర్చజరిగినట్లు, కొన్ని నిర్ణయములు జరిగినట్లు తెలుస్తున్నది. సమావేశము బుధవారం ముగుస్తుందనుకుంటున్నారు.

## భాషారాష్ట్ర విచారణ సంఘానికి ఆచార్య రంగాగారి హెచ్చరిక

### నెహ్రూ, పటేల్ ప్రాతికూల్యమునకు కారణముల వివరణ

మద్రాసు, నవంబరు 22: కాంగ్రెసు కార్యవర్గ సమావేశమునకు పోయివచ్చి నేడే మద్రాసుచేరిన రంగాగారు, దక్షిణదేశములో భాషారాష్ట్రముల ఏర్పాటునుగురించి ఇట్లు చెప్పెను.

"భాషా రాష్ట్రముల నిర్మాణమునకు వాయిదా వేయవలెనని జవహర్లాల నెహ్రూ, సర్దారు పటేలుగార్లు చెప్పుటకు కారణము బీహారు, పంజాబులలో ఈ సమస్య క్లిష్టముగా నుండుటయే. దక్షిణ దేశములో భాషారాష్ట్ర నిర్మాణమునకు పెద్ద సాంఘిక అంతరాయములులేవు కనుక వారికట్టి అభ్యంతరమును ఉండదని నా విశ్వాసము. భాషారాష్ట్రముల ఏర్పాటు సుకరమనియు, ఉచితమనియు, భారతీయ సమైక్యతకు తోడ్పడుననియు ఇక్కడి ప్రజలు నమ్ముచున్నారు. ప్రజలు తమసమస్యలను తామే పరిష్కరించుకొని పరిహాసుల విషయములో తమలో తామే నిర్ణయములు చేసికొనినను, లేదా సరిహద్దు కమిషను నిర్ణయములు శిరసా వహించినను, గాంధీజీ ఆదేశానుసారము త్వరలో భాషా రాష్ట్రము లేర్పడవలెనని కాంగ్రెసు నాయకులు కోరుచున్నారు.

"ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునుగురించి చెప్పుచు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు అంతరాయములేమియు లేవనియు, మద్రాసు పట్టణముగురించి ఆంధ్రతమిళులు రాజీపడజాలనిచో సరిహద్దుసంఘ నిర్ణయములకు ఒప్పుకొందురనియు, ఒరిస్సా సరిహద్దువిషయమైకూడా క్లిష్టసమస్య ఉండదనియు, ఆంధ్రరాష్ట్రము ఆర్థికముగా గట్టిగానే ఉండగలదనియు, భారత ప్రధాని ఉపప్రధానిగార్లు చెప్పినమాటల ప్రభావముచే, భాషారాష్ట్రకమిషనువారు దాక్షిణాత్యుల చిరకాల రాష్ట్రవాంఛను భగ్నపరచు సూచనలు చేయరాదని" యు రంగాగారు చెప్పెను.

### మలయా అల్లరులలో నష్టపడిన భారతీయులు

న్యూఢిల్లీ, నవంబరు 22: ఇటీవల మలయాలో చెలరేగిన అల్లరులలో చనిపోయిన, దెబ్బలుతిన్న, పట్టుకోబడిన భారతీయుల సంఖ్యలు తెలిసినవి. ప్రభుత్వ బలములచే 170 మంది భారతీయులు నిరోధించబడిరి. ఒకడు పట్టుకొనబడెను. ఒకడు చనిపోయెను. తిరుగుబాటు దారుల మూలముగా 8 మంది చనిపోయిరి. మలయా పోలీసు శాఖలోని భారతీయులలో ఆరుగురు చనిపోయిరి. ఆరుగురు గాయపడిరి.

## ప్రచండమైన తుపాను వల్ల బొంబాయిలో బీభత్సస్థితి

### రవాణా సౌకర్యములు ఎక్కడివక్కడ స్తంభించి పోయినవి

బొంబాయి, నవంబరు 22: ఎన్నడును కనివిని యెరుగని భయంకరమైన తుపాను బొంబాయి పట్టణమును, పరిసరములను సంక్షోభపెట్టుచున్నది.

బొంబాయి పట్టణమున్నూ, దానికిచుట్టూ 70 మైళ్ళ వరకూగల ప్రదేశమున్నూ ఈ తుపానులో పూర్తిగా చిక్కుకొనిపోయెను. కొంకణ తీరమున 80 మైళ్ళ వేగముతో గాలి వీచుచున్నది.

గంటకు నూరుమైళ్లవేగము గల ప్రచండమారుతము వీచుచున్నది. బొంబాయి జీవితమంతయు నేటి ఉదయమునుండి పూర్తిగా స్తంభించిపోయినది. తంతులు తెగుటచే విద్యుత్ప్రసారము ఆగిపోయినది. రైళ్లు, ట్రాములు, బస్సులు, బొంబాయిరేవులనుండి స్టీమర్లు, విమానకేంద్రములనుండి ప్రయాణీకుల విమానములు నడచుట మానివేసినవి. ప్రయాణ సౌకర్యములు లేక ఆఫీసులు పనిచేయుటలేదు. గాలికి పెల్లగిలిన చెట్లు రోడ్లకడ్డముగా పడియున్నవి. ఈ తుపానుమూలముగా ఏడుగురు మరణించిరనియు 100 మంది గాయపడిరనియు బి. బి. సి. రేడియో ప్రకటించెను.

బొంబాయికి వాయవ్యమూలగా అరేబియా సముద్రముమీదనుండి సాగిన ఈ తుపాను తూర్పుకు తిరిగి నేడు తెల్లవారుజామున బొంబాయిపైకివచ్చెను. కడచిన 24 గంటలలోనూ ఉత్తర బొంబాయిలో అయిదు అంగుళములవర్షము పడినది.

నేటి ఉదయము గం 5-45 కు టాటా కంపెనీ విద్యుత్కేంద్రము పనిచేయుట మానగానే, విద్యుచ్ఛక్తిమీద నడచు జి. ఐ. పి. రైళ్లు ఆగిపోయినవి. శాంటాక్రుజ్ నుండి నేడు ఎయిరిండియా విమానములు బయలుదేరలేదు. కొలంబో నుండియు, మద్రాసునుండియు బొంబాయికి ప్రయాణీకులను కొనిపోవు విమానములు దారిలో హైదరాబాదువద్ద ఆగిపోయినవి.

నేడు సెలవుదినముగా బొంబాయి ప్రభుత్వము ప్రకటించినది. ఉదయపు పత్రికలు మామూలుగా వెలువడినా, తరువాత తుపాను విజృంభించి నగరమందలి విద్యుచ్ఛక్తిలైనులు యావత్తు ధ్వంసమగుటచే ప్రెస్సులు, లినోటైపు యంత్రములు పనిచేయుటకు వీలుగాకపోయెను. విద్యుచ్ఛక్తి స్తంభములు పెల్లగింపబడుటచే బహుశా ఇంకా 2 రోజులవరకూ నగరములో విద్యుచ్ఛక్తి తిరిగి సరఫరాచేయుట సాధ్యము గాదని తెలియుచున్నది.

ఈ తుపానువల్ల ఎంతమంది మరణించిరో సరిగా తెలియుటంలేదు. కాని నగర మధ్యభాగములలో పురాతనపు కట్టడములు, నివాసగృహములు అనేకములు కూలిపోవుటచే బహుశా చాల ఎక్కువమందే మరణించియుందురని అనుకొనుచున్నారు. అనేకచోట్ల పోలీసు చౌకీలు, కారకొనులు నేలమట్టమగుటచే పలువురు చనిపోయిరి.

5 వ పేజీ చూడుడు

### ఇండో-చైనా ఫ్రాన్సు శాంతి సంప్రతింపులు

పారిస్, నవంబరు 22: ఇండో-చైనాలో శాంతి స్థాపనకై ఫ్రెంచి ప్రభుత్వము, డా॥ హోచిమిన్ అధ్యర్యమున సాగుచున్న వీట్‌నాం జాతీయ ప్రభుత్వముతో రాయబారములు జరుపవలెనని కొందరు ప్రముఖులు నేడు ఒక విజ్ఞప్తి చేసిరి.

## స్వతంత్రభారత రాజ్యాంగంలో గ్రామపంచాయితీలకు ప్రధానస్థానం

### అంబేద్కర్‌గారి వైఖరిలోమార్పు: సంతానంగారి సవరణకు రాజ్యాంగపరిషత్తు ఆమోదం

న్యూఢిల్లీ, నవంబరు 22: పరిపాలనలో అవలంబించబడవలసిన కొన్ని సూత్రములను ఆమోదించి, నేడు రాజ్యాంగపరిషత్తు వానిని రాజ్యాంగ ముసాయిదాలో చేర్చెను. ఆ సూత్రము లివి: ఉచితమైన జీవనోపాధులు కలిగియుండుటకు పౌరులకు స్త్రీ పురుషులందరకు సమముగు హక్కు గలదు; దేశములోని భౌతికసంపద మీది హక్కు భుక్తములు సాముదాయిక శ్రేయస్సుకు అనుగుణముగా పంపకము కావలెను; సాముదాయిక క్షేమమునకు విరుద్ధముగా సంపదయు, సరకులను ఉత్పత్తిచేయు సాధనసామగ్రియు కొద్ది మంది చేతులలో కేంద్రీకృతము అగునట్లు ఆర్థిక విధానములు పనిచేయకుండులాగున ప్రభుత్వము చూడవలెను; స్త్రీ పురుషులుచేయు ఒకేపనికి ఒకే ప్రతిఫల ముండవలెను; శ్రామికుల బల ఆరోగ్యములుగాని పిల్లల పసితనముగాని దుర్వినియోగపరచబడరాదు; ఆర్థిక ఒత్తిడికారణముగా పౌరులు తమ వయస్సుకున్నూ, శక్తికిన్నీ మించిన వ్యాపకములలో ప్రవేశించుట జరుగరాదు; పిల్లల, యువకుల నైతిక, ఆర్థికవిసర్జన ద్వారా దోపిడి జరుగకుండా కట్టుదిట్టము లుండవలెను.

సభ్యులు తెచ్చిన సవరణలలో, కృష్ణమూర్తిరావు తెచ్చిన ఒక స్వల్ప సవరణ మాత్రమే అంబేద్కరుచే ఆమోదించబడి సభచే అమలుజరుపబడెను.

ఇతరులు చేసిన సవరణలలో కె. టి. షా చేసిన సవరణ ఒకటి ఉండెను. ఈ సవరణ ప్రకారము గనులు, అరణ్యములు, నదులు సాముదాయిక స్వామిత్వములో నుండి సాముదాయికముగానే పెంపొందించబడవలెను. ముసాయిదాలో ప్రస్తుతమున్న రచన అస్పష్టముగా నున్నదనియు, దేశములోని సహజసంపద ప్రజలదనియు, దానిని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు ప్రజల తరఫున పెంపొందించవలెననియు, గనుల వంటి దేశ సంపదలు వ్యక్తుల అధీనములో నుండుట దూరదృష్ట్యా దేశమునకు క్షేమము కాదనియు చెప్పెను. భౌతిక సంపదల, సాంఘిక సౌకర్యముల, సాముదాయిక నిర్మాణముల వ్యవస్థలో వ్యక్తులకు ఏట్టి యాజమాన్యపు హక్కులు ఉండరాదని కే. టి. షా మరియొక సవరణను ప్రతిపాదించెను. సంపదను సృష్టించు పరి

(5-వ పేజీ చూడుడు)

## "రక్షణ, రవాణాల విషయంలో నేటి ఏర్పాట్లే మరికొంతకాలం ఉండాలి"

### భారతప్రభుత్వానికి నైజాం లేఖ: వైదేశిక వ్యవహారాలపై అధికారంఎన్నడూలేదనిప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 22: భారతప్రభుత్వముతో హైదరాబాదుసంస్థానము చేసుకొన్న యథాతథపు ఒడంబడిక కాలపరిమితి ఈ నెల 29 వ తేదీతో పరిసమాప్తమైపోవును. కనుక, రాకపోకలు, రక్షణ విషయములలో ఇప్పటి ఏర్పాటులనే ఇకముందుకూడా కొనసాగనివ్వవలసిందని కోరుతూ నైజాం భారతప్రభుత్వమునకు వ్రాసుకొన్నట్లు అధికారవర్గములద్వారా తెలియవచ్చెను.

వైదేశిక వ్యవహారములలో 1947 అగస్టు 15 కు పూర్వముగాని, ఆటుతరువాతగాని హైదరాబాదుకు స్వాతంత్ర్యం లేదుకనుక, ఎప్పటివలెనే ముందుకూడా ఈ వైదేశిక వ్యవహారముల నిర్వహణబాధ్యత భారత ప్రభుత్వానిదేనని నైజాం ఈలేఖలో తెలిపెను. యథాతథపు ఒడంబడిక ననుసరించి హైదరాబాదు రాకపోకలు, రక్షణ, వైదేశిక వ్యవహారములు భారతప్రభుత్వ ఆజ్ఞాయిష్షీకి లోబడియుండెను.

### 'హైద్రాబాద్‌పై వెంటనే చర్చ జరగాలి'

#### భద్రతామండలి అధ్యక్షునికి జఫ్రుల్లాఖాన్ లేఖ

పారిస్, నవంబరు 22: రెండు నెలలక్రిందట పోరాట మాగిపోయినప్పటినుండి, విరమింపబడిన హైదరాబాదు చర్చలను త్వరలో తిరిగి ప్రారంభింపవలసినదని పాకిస్థాన్ ఐక్యరాజ్య భద్రతా మండలి నడిగినది.

హైదరాబాదులో పరిస్థితులు అక్టోబరునుండీ మరింత విషమంగా పరిణమించుచున్నవనీ, మండలివారు సత్వరచర్యలకు ఉపక్రమింపవలసినదనీ పాకిస్థాన్‌ప్రతినిధి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ భద్రతామండలికి ఒక లేఖను వ్రాసెను.

### జార్జిరాజుగారి కుడికాలులో రక్తప్రసారలోపము

లండన్, నవంబరు 23: ఆస్ట్రేలియా, న్యూజిలెండులకు రాజదంపతుల యాత్ర నిరవధికముగా వాయిదా వేయబడినదని బక్కింగ్ హాం రాజభవనమునుండి నేడు అధికార ప్రకటన జరిగినది. జార్జి రాజు కుడికాలులో రక్త ప్రసారము సక్రమముగ లేకపోవుటచే ఈ ఆధినివేశ పర్యటనము వాయిదా పడుటకు కారణమని ప్రకటన తెలుపుచున్నది.

కుడికాలిరక్త ప్రావము సరిగ లేకపోవుట ఆందోళన హేతువగుచున్నదని కూడ ఇదే ప్రకటనలో గలదు.

రాజుగారి ఆరోగ్యమును గురించి వైద్యుల ప్రకటన ఇట్లున్నది:

"రాజుగారి మామూలు ఆరోగ్యము బాగుగానేవున్నది; గుండె పరిస్థితికూడా చక్కగానేవున్నది. ఇది ఏవిధమైన ఆందోళనకూ కారణముగుటలేదు. పన్నెండు సంవత్సరముల రాజ్యభార నిర్వహణశ్రమ ఆయన శరీరపటుత్వమును తగ్గించివేసినది. ఈ స్థితిలో దీర్ఘప్రయాణమునకు ఉద్యమించుట ప్రమాదాస్పదము. రక్త ప్రసారము లోపముగావున్న కుడికాలుకు తీవ్ర ప్రమాద మేర్పడవచ్చును.

గత వారమురోజులనుండియు ఐదుగురు వైద్యులు జార్జిరాజు ఆరోగ్యమునుగురించి శ్రద్ధ వహించుచున్నారు. కుడికాలు మొద్దుబారి పోవుచున్నదను విషయమును వైద్యులకు రాజుగారు రెండువారముల క్రితమే చెప్పిరి.

ఆస్ట్రేలియా, న్యూజిలెండుల పర్యటనను వాయిదా వేయవలసినదని వైద్యులే సలహా ఇచ్చిరి.

రాజుగారు మామూలు రాజరిక వ్యవహారములను చూచుచునేయుందురు.

### జపాన్ యుద్ధనేరస్థుల శిక్షలు

#### మిత్రరాజ్యప్రతినిధుల ఆమోదం

టోక్యో, నవంబరు 22: 25 మంది జపాను యుద్ధనేరస్థులను అంతర్జాతీయ విచారణ సంఘమువారు విచారించి ఇటీవల యిచ్చిన శిక్షలను నేడు మిత్రరాజ్య ప్రతినిధులు బలపరచిరి. భారతీయ ప్రతినిధి మాత్రము తన అసమ్మతిని తెలిపెను.

ముద్దాయీలు ఈ శిక్షలపై చేసుకొన్న అప్పీలుగురించి తననిర్ణయమును ఈ వారములోనే తెలిపెదనని మిత్రమండలి సర్వసేనాని జనరల్ మెకార్థరు చెప్పెను.

### నైరుతి ఆఫ్రికా పరిపాలనము

ప్యారిస్, నవంబర్ 22: నైరుతి ఆఫ్రికాలో ద. ఆఫ్రికా యూనియను పరిపాలన విషయమై తాము జనరల్ అసెంబ్లీకి సమర్పించిన నివేదికను ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వసంఘమువారు నేడు ఏకగ్రీవముగా ఆమోదించిరి. జనరల్ ఎసెంబ్లీవారు ఈ నివేదికను శుక్రవారమునాడు విచారణలోనికి తీసికొనెదరని అనుకొనుచున్నారు. (అ. ప్రె.)

## గంటల పంచాంగం

సర్వధారి సం॥ కార్తీక బ॥ అష్టమి 1948 సం॥ నవంబరు 24 బుధవారం బ॥అష్టమి ప 1-47 మఘ ఏ 11-12 వర్జ్యం సా 6-43 ల 8-13 కు.

బ॥ నవమి నవంబరు 25 గురువారం ను నవమి ప 11-37 పుబ్బ ప 9-41 వర్జ్యం సా 4-30 ల 6-0 కు.

# ఆంధ్రపత్రిక

సర్వధారి సం॥ కార్తీక బ॥ అష్టమి

బుధవారం

## పట్టాభిగారు

నవంబరు 24 న యావదాంధ్ర దేశము డా॥ పట్టాభి సీతారామయ్యగారి 69 వ జన్మదినోత్సవము జరుపుచున్నది. నాయకులు కేవలము ప్రజాభావములకు, ఆశయములకు ప్రతిబింబములు. నాయకుల జన్మదినోత్సవమును జరుపుటలో ప్రజలు వారిపట్ల తమ గౌరవాభిమానములను ప్రదర్శించుటే గాక, కొంతవరకు ఆత్మసంతృప్తిని ఆనందమును కూడ పొందుచున్నారు. పట్టాభిగారు కాంగ్రెసు అధ్యక్షుడుగ ఎన్నిక అగుట ఆ ఆనందమును మరింత అతిశయింపచేయుచున్నది.

పట్టాభిగారి గుణగణముల ప్రశంస, వారి మేధాసంపత్తి, దేశభక్తి వర్ణన, ఇపుడు చర్వితచర్వణమే అగును. దేశసేవలో వారు పండిరనుట తప్ప వేరుమాట అనవసరము. వయస్సు పెరుగుచున్నప్పటికీ ప్రజాసేవయందు పిన్నవయస్కుల ఉత్సాహమునే ప్రదర్శించుచున్నారు. "వృద్ధత్వం జరసావినా" అన్నమాట వీరికి చక్కగా అన్వయించుచున్నది.

పట్టాభిగారు కాంగ్రెసు అధ్యక్షపదవికి ఎన్నిక అగుటచే ఆంధ్రుల చిరకాల వాంఛతీరినది. దానితోపాటు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయమున వారి ఆశలు ఇనుమడించినవి. కాంగ్రెసు అధ్యక్షుడు కార్యవర్గమునకు చేర్మెను మాత్రమే అని కొందరు పండితులు వ్యాఖ్యానించినప్పటికీ, ఆపదవి కేవలము నామమాత్ర మనుటకు వీలులేదు. ఎన్నిక ద్వారా అధ్యక్షపీఠమును ఆక్రమించుటచేత, రాష్ట్ర కాంగ్రెసు సంఘసభ్యులు కొన్ని సిద్ధాంతములను, కొన్ని విధానములను దృష్టియందుంచుకుని ఓటుచేసిరని చెప్పవలసియున్నది. కాంగ్రెసు కార్యవర్గము, తన భవిష్యత్ విధానమును నిర్ణయించుటలో ఈ అంశములను విస్మరించుటకు వీలులేదు. దానిని దిద్దుటలో అధ్యక్షునకు అధికమైన భాగముండుననుటకు సందేహము లేదు. పట్టాభిగారు కరుడుగట్టిన గాంధీతత్వవాదియే గాక, భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణవాది. గత 30 సం॥ ములుగా ఆయన ఆ ఉద్యమమును నిర్విరామముగ సాగించుచుండెను. కాంగ్రెసు ఎపుడో భాషారాష్ట్రసూత్రమును అంగీకరించినది. అందువల్ల దానిని అమలుపరచుటకు పట్టాభిగారు అధ్యక్షస్థానములో నుండుట ఎంతయు తోడ్పడునని భాషారాష్ట్రవాదులందరు ఆశించిన అందు అసహజమనునది లేదు. ఈ మధ్య కాంగ్రెసు అగ్రనాయకులు భాషారాష్ట్రములకు ఇది అదను కాదని, ఆ సమస్యను ప్రస్తుతమునకు వాయిదావేయవలెనని ఉద్ఘాటించుచు వచ్చిరి. కాని దానికిగల కారణములను మాత్రం వారు తేటతెల్లము చేయలేదు. వారిలోముఖ్యము ఆంధ్రరాష్ట్రమునకు వర్తించదని కొందరు విషయజ్ఞులు చెప్పుచూ వచ్చిరి. దక్షిణదేశ భాషారాష్ట్ర విభజనకు నెహ్రూ, పటేల్ గార్లకు అభ్యంతరముండదని శ్రీరంగాగారు తెలుపుచున్నారు. మొన్న 16 వ తేదీన ఢిల్లీ ఆంధ్ర సంఘము వారేర్పాటుచేసిన సన్మానసభలో ప్రసంగించుచూ, "రాష్ట్రముల పునర్నిర్మాణమును ఇక అనవసరంగా జాప్యముచేయరాదు" అని పట్టాభిగారు ఉద్ఘాటించిరి. ఇదివరకు ఏమైనప్పటికీ ఇక జాప్యముచేసిన అది అకారణమనే చెప్పవలసియున్నది. వాయిదా వేయమనిన నాయకులు దానికి తగిన కారణములను తెలియజెప్పవలసియున్నది. అదే పట్టాభిగారి ఉద్ఘాటన తాత్పర్యము. ఆ సందర్భమున పట్టాభిగారినిగాని, భాషారాష్ట్రవాదులనుగాని ఒప్పించుటలో కాంగ్రెసు అగ్రనాయకులకు సాధ్యము కాదు. భాషా రాష్ట్ర నిర్మాణ పరిశీలనా సంఘము తమ నివేదికను ఈ నెలాఖరున పరిషత్తుకు సమర్పింపనున్నారు. వారి సూచనలు ఏవిధముగ నుండునదీ తెలిసికొనుటకు ప్రజ అమిత ఆసక్తితో ఎదురుచూచెదరు.

నాయకుల జన్మదినోత్సవములు వేడుక దినములుగాక, వారు ఆశించిన లక్ష్యములను సాధించుటకు ప్రజాబాహుళ్యము తోడ్పడవలసియున్నది. అపుడే జన్మదినోత్సవమును జరుపుటయందు ఔచిత్యమున్నది. ఆంధ్రరాష్ట్ర సంపాదనతోపాటు అంతముఖ్యమైనది ఆంధ్రదేశములో వివిధ రాజకీయ వర్గములందు ముఖ్యముగా కాంగ్రెసువర్గములందు ఏకీభావము కుదురుట. ఈ ఏకీభావములేనిలోటు కడచిన రెండు సంవత్సరములుగా వెల్లడి అయినది. దానివల్ల కలిగిన ఫలితములు అందరికీ ద్యోతకమయినవి. పట్టాభిగారు కాంగ్రెసు అధ్యక్ష ఎన్నికకు నిలబడినపుడు, అన్నివర్గములు నాయకులు ఏకమైరి. ఈ ఐక్యభావమే ముందు కూడ సాగి స్థిరపడవలసియున్నది. అది లభించినగాని, ఆంధ్రరాష్ట్ర సిద్ధిప్రాప్తి ప్రయోజనమును అనుభవించుట కష్టసాధ్యము. కాబట్టి పట్టాభిగారి జన్మదినోత్సవము జరుపునాడు ఈ అంశము, ప్రధానముగ ఎంచ బడునని ఆశించుచున్నాము. రాష్ట్రములోని వివిధ వర్గములను సమైక్యపరచుటలో పట్టాభిగారి కృషి జయప్రదమగుననుటకు సందేహము లేదు. దేశశ్రేష్ఠమార్గమై భగవంతుడు వారికి దీర్ఘాయు రారోగ్యములను ప్రసాదించుగాక !

## పారిశ్రామిక కార్మికులకు కనీస వేతనము

లక్నో, నవంబరు 22: కార్మికులకూ, ఆలయిన్నుల విషయమై విచారణ సంఘము వారు గావించిన కొన్ని సిఫారసులను రాష్ట్రప్రభుత్వమువారు అంగీకరించి పట్టణములయందలి బట్టల మిల్లుల పనివారికి నెలకు 30 రూపాయలు మొఫసల్ ప్రదేశముల పనివారికి నెలకు 28 రూపాయలు కనీసవేతనముగా నిర్ణయించియున్నారు. ఇదిగాక వారి అలవెన్సులనుగూడ నిర్ణయించియున్నారు.

కాన్పూరు, ఆగ్రా, కాశీ, అలహాబాదు నగర కార్మికులకు 35 రూపాయలు ఇతర ప్రదేశముల పనివారికి 25 రూపాయలు కనీస వేతనముగా నిర్ణయింపబడినది.

విద్యుచ్ఛక్తి కర్మాగారములు కనీస వేతనముకుండి మినహాయింపబడినవి. నక్కి రక్షక శక్తి పనివారికి వేతనము నిర్ణయింపబడలేదు. స్త్రీలకు పురుషులకు సమానమైన పనికి సమానవేతన మొసంగు సిద్ధాంతమును ప్రభుత్వమువారంగీకరించిరి. (ఆ. ప్రె.)

## ఉత్తర చైనాలో భయంకర యుద్ధం

### కమ్యూనిస్టు సేనలవిజయం

షాంఘై, నవంబరు 22: "బ్రహ్మాస్త్రా కారముగాను నేడిందుకుని దక్షిణంగా అసంఖ్యాకంగావచ్చిపడే కమ్యూనిస్టు బలములతో ఉత్తర చైనాలో యుద్ధం మూర్తి స్వరూపమును దాల్చగలదని టీంట్సిన్ నుండి వచ్చిన వార్తా తలు తెల్పుచున్నవి.

మంగ్ చౌకు నూర్పుగా పెకింగ్‌కు 10 మైళ్ళ దూరంలో ఉన్న కమ్యూనిస్టు సేనలు ప్రభుత్వ సైన్యములు అతిభీకరంగా తాకి, వానిని ఈశాన్యముగా 100 మైళ్ళ దూరములో "పెద్దగోడ" వద్ద నున్న షాన్‌హైకువంకరకు తరిమి వేసినవని టీంట్సిన్‌వార్తలు తెలుపుచున్నవి. ప్రభుత్వసేనలు ఎక్కువ్క చిగా విజృంభించుటకీ విమానం నుండి ప్రయత్నించినటేనని టీంట్సిన్ పరిశీలకులనుచున్నారు.

కమ్యూనిస్టులకు 300 విమానము లున్నవనీ, ఉత్తర మంచూరియాలో విమాన కోర్స్ పలకు ఆర్నీఛు చేయుచున్నారనీ, టీంట్సిన్‌లోని ఉపరస్థాన్యతుడు జనరల్ హూదంగ్ టంగ్ నిన్న అన్నాడు.

### సూచౌ రంగం

నాన్‌కింగుకు 210 కి. ల హ ద్వారంచంటి సూచౌ నగరానికి తూర్పుగా ప్రళయభీకరమైన యుద్ధం జరుగుచున్నది. ప్రభుత్వ సేనలు కమ్యూనిస్టులను తిరుగగొట్టుచున్నారనీ, రెండు వరములు వీరికి సహాయముగా వచ్చుచున్నవనీ తెలియుచున్నది. కాని ఈ దళములకు ప్రతిఘటన తీవ్రముగనున్నదనీ, చుట్టుముట్టివేయబడిన ప్రభుత్వ సేనలు దాసోహమనుటకంటే గత్యంతరం లేదనీ నాన్కింగులోని పరిశీలకులు భావించుచున్నారు.

ఉత్తరచైనాలో పెపింగ్-చ్యూయాంగ్ రైల్వే పంబడి కమ్యూనిస్టులు భారీ రొంత్తున తిరోగమించుచున్నారని ప్రభుత్వము ప్రకటించుచున్నది.

మధ్య చైనాలో ప్రభుత్వసేనల బలీయ స్థానమైన సుహానగరం చుట్టుప్రక్కల భీషణసంగ్రామం సాగుచున్నట్లు, కమ్యూనిస్టులు ఆదనపు సేనలను రంగములోకి ఉరికించుచున్నట్లు, వార్తలు వచ్చుచున్నవి.

ఇంతవరకు యుద్ధమంటే యేమిటో ఎరుగని సేనలను సుహారంగములో ప్రభుత్వసేనలచే ఓడిపోయిన తమ సేనలకు రక్షణగా, యుద్ధములోకి పంపుచున్నారని; కడచిన రాత్రి, చైనాప్రభుత్వ రక్షణ కార్యాలయంలో ప్రకటన తెలుపబడెను.

సుచౌ ఉత్తరదిశగా 200 మైళ్ళ దూరములో, నాన్‌కింగ్‌కు ముఖద్వారముగ నెలున్నది.

ఇప్పటికి షుమారు 15 రోజులుగా, సుచౌకు తూర్పున కమ్యూనిస్టు చక్రబంధములో యిరుకుకొనియున్న ప్రభుత్వసేనలు పశ్చిమాభిముఖంగా విస్తరించుకొనుచూ, చక్రబంధమునుండి బయటపడుటకు ప్రయత్నించుచున్నవి. విమానములు నేటియొదక ఋజుతో ట్యాంకులతో అందువలన సహాయముతో ఈ నాడు సేనలను విడిపించుటకు ప్రయత్నించుచూ చాలావరకు విజయము సాధించ కలిగినవి.

ఉత్తర చైనా యుద్ధపరిస్థితి మందకొడిగా నున్నది. చైనా ప్రభుత్వ సేనలు పరోపేరాష్ట్రరాజధానియైన పావ్‌టింగ్‌ను ఖాళీచేయుటం ప్రారంభించినది. దూరస్థమైన ప్రదేశములనుండి తమ సేనలను ఉపసంహరించుకోవాలనే ప్రభుత్వ వ్యూహమని దీనినిబట్టి తేలుచున్నది.

టీన్స్టిన్-పెపింగ్ రైల్వేకు ఉపద్రవము తెచ్చిపెట్టుచున్న కమ్యూనిస్టుసేనలు టీన్స్టిన్‌కు పశ్చిమగా 17 మైళ్ళ దూరములోనికి చొచ్చికొని వచ్చినవి.

### పావ్‌టింగు కమ్యూనిస్టుల కైవసం

లాన్‌ఫ్రాన్సిస్కో, నవంబరు 22: హోపేరాష్ట్ర రాజధాని పావ్‌టింగును ఆక్రమించితిమని చైనా కమ్యూనిస్టులు రేడియోలో చేసిన ఒక ప్రకటన ఇక్కడ వినబడినది.

పెకింగుకు పావ్‌టింగ 90 మైళ్ళు నైర్‌తిగా సింహద్వారంవలె నున్నది.

### హోపేరాజధాని నుంచి ఖాళీ సమాప్తము

షాంఘై, నవంబరు 22: హోపేరాష్ట్ర రాజధాని పావోటింగునుండి చైనాప్రభుత్వ సేనలు ఖాళీచేయుట నేటితో ప్రారంభమాయినది. కమ్యూనిస్టు సంగ్రామములో సాగలందరు ప్రభుత్వమునకు సహాయపడుటకు అవసరమని పౌరలు ప్రజాపాలకులు ఉద్బోధించిరి. పావోటింగునుంచి ప్రజలు ఖాళీచేయుచున్నారని నవంబరులు ప్రకటించిరి.

## హైదరాబాద్‌లో కార్మిక సమస్యల పరిష్కారం

### భారత ప్రభుత్వాన్ని అనుకరించుటకు నిర్ణయం

హైదరాబాద్, నవంబరు 22: ఇండియా పార్లమెంటు యిటీవల ఆమోదించిన 'కనీసవేతనబిల్లు' మాదిరి బిల్లునే హైదరాబాదు ప్రభుత్వం తయారుచేసినది. ఇది ఒక నిబంధనరూపంలో సంస్థానంలో త్వరలో అమలు జరుపబడగలదని నేడు తెలియవచ్చినది. ఇంతేగాక సంస్థానంలో ప్రస్తుతం అమలులోనున్న కార్మిక తగాదా ఉత్తరువుస్థానే పారిశ్రామిక తగాదాచట్టము అమలు జరుపబడుటకూడ జరుగును. ఈ రెండు పనులు త్వరలో జరుగునని తెలియుచున్నది. దీనివలన సంస్థానకార్మిక విధానం భారతప్రభుత్వ కార్మికవిధానంతో సరిసమానంగా నుండగలదు.

### సంస్థానకాంగ్రెస్ సమావేశం

హైదరాబాద్, నవంబర్ 22: సంస్థాన కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి ప్రొఫెసర్ రామాచార్యగారీ క్రిందిప్రకటన చేసిరి:

నవంబరు 30 వ జరుగనున్న అఖిల హైదరాబాద్ కాంగ్రెస్‌సంఘ సమావేశమునకు హాజరగుటకు అవకాశమివ్వవలసిందిగా కోరుచు అనేకమంది సంస్థాన కాంగ్రెస్ సేవకులు, పౌరులు విజ్ఞప్తులు పంపుచున్నారు. ఆహ్వానసంఘంవారు సమావేశపు ఏర్పాట్లు ఘనంగా చేయుచున్నప్పటికీ ప్రస్తుతం అందుబాటులో నున్న వసతి చాల పరిమితమైనది. ప్రస్తుతమున్న వసతి సరిపోవునంతవరకు ఆహ్వానాలు పంపినాము. కాబట్టి ఆహ్వానాలు లేకుండా సంస్థాన కాంగ్రెస్ సేవకులుగాని, పౌరులుగాని సమావేశమునకు రావద్దని విజ్ఞప్తి చేయుచున్నాను.

### కమ్యూనిస్టు అరెస్టు

హైదరాబాద్ పోలీసులు 22 వ తేదీ సాయంకాలం సులేమాన్ అరబ్ అను సంస్థాన కమ్యూనిస్టునాయకుని అరెస్టుచేసిరి. ఇతడు హైదరాబాద్ అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడు.

### మహమ్మద్‌రజ్వీ ఆత్మహత్య

నిజాం ప్రభుత్వ ఆబ్కారీశాఖ అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు జనరల్‌గా పనిచేసి రిటైరు అయిన మహమ్మద్‌రజ్వీ అనునతడు సోమవారము ఉదయం తన స్వంత గృహంలో రివాల్వరు పేల్చుకొని ఆత్మహత్య చేసుకొనెను. ఆర్థిక చిక్కులద్వారా కలిగిన మానసిక వ్యాధియే యితని ఆత్మహత్యకు కారణమని తెలియవచ్చినది.

### వినోబభావే హైదరాబాద్ రాక

గాంధీజీ ముఖ్యశిష్యులలో నొకరగు ఆచార్య వినోబభావేగారు డిసెంబరు 3-న హైదరాబాద్‌వచ్చి ఒక వారం రోజుల పాటు ఉండెదరని తెలియుచున్నది.

### ఉస్మానియా విశ్వవిద్యాలయం

ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు నవాబ్ ఆలీయవార్‌జంగ్ ఉపాధ్యక్షుడుగా నియమించబడెను. ఈ నియామకొన్ని తెలియజేయుచు నిజాంనవాబు నిన్న ఒక ఫర్మానా జారీచేసెను. ఆలీయవార్‌జంగ్ పదవిస్వీకరణ సందర్భంలో ఉపాధ్యాయులు స్వాగతపత్రములను సమర్పించిరి. వాటికి సమాధానంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఇతర గొప్ప విద్యాసంస్థలవలె, భారతదేశ ప్రజలలో ఐకమత్యమును పెంపొందించుటలో కృషి చేయవలసియున్నదని యవార్‌జంగ్ చెప్పెను. తనకు రాజకీయాలతో సంబంధం లేదనీ, అందుచే రాజకీయ ఉపన్యాసం చేయుట తన అభిమతంకాదనీ ఆయన చెప్పెను. ఉస్మానియా విశ్వవిద్యాలయ కార్యభారమును గురించి ప్రస్తావించుచు "హైదరాబాద్ సంస్థానం భారతదేశంలో రాజకీయంగానే గాక, సర్వాత్మనా ఐక్యమైపోయింది కాబట్టి, యీ పరిస్థితుల దృష్ట్యా విశ్వవిద్యాలయం తన రూపు రేఖలను దిద్దుకొనవలసియున్నది." అని ఆలీయవార్‌జంగ్ చెప్పెను.

### సంస్థాన విద్యార్థి కాంగ్రెస్ కార్యవర్గం

హైదరాబాద్ సంస్థాన విద్యార్థి కాంగ్రెస్ కార్యవర్గం వారు మొన్న సమావేశమై విద్యార్థి కాంగ్రెస్ భవిష్యత్కార్యక్రమమును గురించి చర్చజరిపిరి. సంస్థాన ప్రజాపోరాటంలో ప్రాణముల కోల్పోయిన వీరులకు జోహారులర్పించుచు ఒక తీర్మానంచేసిరి.

### జనగాం తాలూకాలో కమ్యూనిస్టు కల్లోలం

హైదరాబాద్, నవంబరు 21: జనగాం తాలూకాలో రజాకార్ చెనున తొలగిన తర్వాత కమ్యూనిస్టు కల్లోలం ఉధృతంగా నున్నదని ఆ తాలూకాలో యిటీవల పర్యటించి వచ్చిన దాశైమువ్వ, పాయం పత్రికా సంపాదకుడు అక్బర్ హుస్సేన్ చెప్పిరి. "పోలీసు చర్యలు జరుగుటకు ముందు ఆ తాలూకాలోని ముస్లింలను రజాకార్లు బెదరించిరి. పశువులు పెద్దవైన వాటిని బలవంతంగా దోచుకొనిపోయిరి. పోలీసు చర్యలతో యీ ముస్లింలు రజాకార్ల చేతులనుండి బయటపడిరి. కాని కమ్యూనిస్టుల చేతుల్లో చిక్కుకొనిపోయిరి. అనేకమంది ముస్లింలు ఇండ్లను వదలి పారిపోయిరి. వీరిని తిరిగి వారి యిండ్లకు రప్పించుటకు అధికార్లు కృషిచేయుచున్నారు. కాని కమ్యూనిస్టులు యీ కృషిని నిష్ఫలం చేయుచున్నారు. మిలిటరీ ప్రభుత్వం లేదను రజాకార్లనుండి ఆయుధములను సేకరించవలసిందిగా అధికారమిచ్చిందని చెప్పి కమ్యూనిస్టులు వీరివద్దనుండి ఆయుధములను లాగుకొనిరి. ఈ విధంగా కమ్యూనిస్టులవద్దకు అనేక ఆయుధములు చేరినవి. కమ్యూనిస్టులకు జడిసి తాలూకాలోని ప్రజలు ఆందోళనచెందుచున్నారు." అని వారు చెప్పిరి.

## వ్యవసాయ విచారణ సంఘము

### పట్టాదారు కౌలుదారుల సంబంధం గూర్చి సాక్ష్యం

మదరాసు, నవంబరు 23: కాంగ్రెసు వ్యవసాయ సంస్కార విచారణసంఘ కార్యదర్శి శ్రీ. మిత్రగారు యీ దిగువ ప్రకటన గావించిరి:

"కమిటీవారు సాక్షుల విచారణ నేడుదయం 9 గం.కు ప్రభుత్వమందిరమున ప్రారంభించిరి. ఉదయం మధ్యాహ్నం యీ దిగువవారి సాక్ష్యములు పైకొనిరి.

టి. కె. దొరస్వామయ్యరు, తిరిచెంచి సెంటినీ అగ్రనైజేషను కమిషనర్సభ్యులు, కె. జి. రామమూర్తిఅయ్యరు, కే. గోవిందరాజులు నాయుడుగార్లు, తంజావూరు జిల్లా వ్యవసాయసంఘ సహాయకార్యదర్శి ఎన్. ఎస్. అయ్యరు, కొందరసలు వ్యవసాయ సంఘ స్థాపకుడు; కే. జి. శివస్వామి. ద. ఇ. వ్యవసాయ కూలీలసంఘముల ఫెడరేషను అధ్యక్షులు. ఈ దిగువ విషయాల గూర్చి సాక్ష్యం పైకొనబడెను:—(1) పట్టాదారు కౌలుదారుల సంబంధము. (2) కౌలుదారునకు బొంబాయి చట్టంలోవలె రక్షణలొసగే చట్టంచేయుట. (3) వ్యవసాయమునకు సంబంధించిన వారందరికిన్ని గ్రామసీమలు కట్టుబాటుల మధ్యను లాభములు సరిగా పంచే ఆర్థిక విధానం నిర్ణయించుట. (4) వ్యవసాయకూలీలకు కనీస వేతన నిర్ణయచట్టం మూడేండ్లలోగా అమలుజరుపుట. (5) రైతుల ఋణములు రద్దుచేయుట అవసరమా (6) పరిపాలనశాఖలందున్న వారికి నూతన దృక్పథములవడ చేయుట ఎట్లు ?

ఈ దిగువ కమిటీ సభ్యులు హాజరయ్యిరి:—జె. సి. కుమరప్ప (అధ్యక్షులు) ఓ. పి. రామస్వామిరెడ్డిగారు, ఆదినారాజాగారు, ఎన్. జి. రంగాగారు ఎం. ఎల్. దంతవాలాగారు, కె. మిత్రగారు.

కె. జి. శివస్వామిగారు, (సర్వెంట్సు ఆఫ్ ఇండియా) కమిటీ వారికొక ప్రణాళికను దాఖలుచేసిరి. ఋద్దున సాక్ష్యం తెలుపునపుడు మదరాసు ప్రధాని ఆర్థిక విధానమును విమర్శించిరి. కాంగ్రెసు శిస్తు వసూలుచేసే భూస్వాముల చేతిలోపడింది. వారు రెండేండ్లనుండి అనుకుంటున్న వ్యవసాయ రాబడి పన్నుచట్టమును మూలపెట్టిరి. కౌలుకు సంబంధించిన చట్టములు చేస్తామని గత రివెన్యూ మంత్రిగారు ఎన్నో ఆశలు చూపిరి. వ్యవసాయ కూలీలను నివాసపు నేలలనుండి తరిమేకుండా నివారించు చట్టము గూడ నిలిపివేసిరి. వ్యవసాయానికి ప్రోత్సాహంచేసే పేరిట బోనసులు యిస్తున్నారు. ఇవి భూస్వాములే తినేస్తారు గాని కౌలుదారులకు యివ్వరు. భూమిశిస్తు రూ 7,50,000 తగ్గించిరి. దీని లాభమంతా శిస్తు వసూలుచేయు భూస్వాములకే పోతుంది కాని పాలందున్నే రయితుకి పోదు. మదరాసు ప్రభుత్వంవారు ధాన్యం ధర పెంచుతామంటున్నారు. అదైనా తినుటకు కొగా మిగిలిన రయితులకే లాభించును కాని, పేద రయితులకు లాభించదు. వ్యవసాయ కూలీలను ఒక సంఘముగ కట్టుదిట్టములతో కార్మిక సంఘ పద్ధతిని తయారుచేయు వారంపదని తెలుపుతో పెరుగుతున్నారు. పరిశ్రమలందు కార్మికులకు ఘంటల ప్రకారం వేతనాలు యిచ్చునట్లే, వ్యవసాయ కూలీలకు గూడ యిచ్చి, వారికి అనుకూల పరిస్థితి లేర్పరుచవలెను. అని శివస్వామిగారు తెలిపిరి.

### హైదరాబాద్‌కు పెట్రోలు సరఫరా

హైదరాబాద్, నవంబరు 20: డయిసెల్ ఆయిల్, మోటార్ స్పిరిట్ సప్లయి పరిస్థితి అస్తవ్యస్తముగా నున్నదనీ, పెట్రోలియము కొరవగానుండుటచేత పెట్రోల్ వినియోగించు మోటార్లు, యంత్రములు మున్నగువాని సంఖ్య హెచ్చించు అవకాశము లేదని ఇండియా ప్రభుత్వము వారు తెలి. ఇట్లు నేడు వెలువడిన పత్రికా ప్రకటన చెప్పుచున్నది. ఈ కారణము చేత పెట్రోలియమ్ వనరుపు మోటారుకార్ల హైదరాబాద్ నుంచి స్వర్ణగారు వ్యాపారులు, కంపెనీలు, వ్యాపారసంస్థలు, పెట్రోల్ సరఫరా పరిస్థితియెట్లున్నా పెట్రోల్ రేషనింగ్ అధికారులను అడిగి కనుగొని, వానితో సాలోచించి, మరి అడ్వర్టీస్వవలెనని ప్రకటన తెలుపుచున్నది. ఆ. ప్రె.

## క్రైస్తవులపట్ల నిరాదర ప్రవర్తన

### కౌన్సిల్‌లో విద్యామంత్రి పశ్చాత్తాప ప్రకటన

చెన్నపట్నం, నవంబరు 23: మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో నేడుదయం ప్రశ్నల కాలంలో విద్యాశాఖామంత్రి అవినాశిలింగంచెట్టిగారు క్రైస్తవులపట్ల నిరాదరంగా ప్రవర్తించినందుకు పశ్చాత్తాపమును ప్రకటించిరి. సెకండరీ పాఠశాలలకు ఎండోమెంట్లు స్థాపించవలెనను ఉత్తరువు కొన్ని హిందూ విద్యాలయాలకు వర్తింపచేయకుండా క్రైస్తవ విద్యాలయాలకు వర్తింపచేయుచున్నమాట నిజమేనా అని నేడు డా॥ జాన్‌గారు ప్రశ్నించగా విద్యామంత్రి అవినాశిలింగం ఈ క్రింది వివరాలను తెలిపిరి. రాష్ట్రములోని సెకండరీ పాఠశాలలకు ఎండోమెంట్లు స్థాపించవలెనని ప్రభుత్వం ఉత్తరువు చేసింది. చెన్నపట్నంలో గోవిందప్ప నాయకవీధిలో ఒక తెలుగు ఎలిమెంటరీ స్కూలును, ఒక తెలుగుబాలుర సెకండరీ స్కూలును, ఒక తెలుగు బాలికా సెకండరీ పాఠశాలను నడుపుచున్న శ్రీ కన్యకాపరమేశ్వరీ ధర్మసంస్థవారు, ధర్మసంస్థయే స్వయంగా పాఠశాలలను నిర్వహించుచున్నందువలన, వేరే ఎండోమెంటు అనవసరమని సూచించుచూ, పై ఉత్తరువు తమ పాఠశాలలకు వర్తింపచేయరాదని కోరుచూ విద్యాశాఖ డైరెక్టరుకు ఒక దరఖాస్తు పెట్టినారు. ఈ ధర్మసంస్థ, రామకృష్ణమిషన్, పచ్చయ్యప్ప ధర్మసంస్థలవలె రిజిష్టరైన ధర్మసంస్థయని తెలుపుచూ వారి ధర్మసంస్థనే ఆ పాఠశాలల ఎండోమెంటుగా పరిగణించు విషయమై ప్రభుత్వమును నిర్ణయించవలెనని డైరెక్టరు ప్రభుత్వమును కోరినారు. ఆ ధర్మసంస్థలనే ఆ సెకండరీ పాఠశాలలకు ఎండోమెంట్లుగా పరిగణించు విషయమై ప్రభుత్వం విచారించుచున్నదేగాని ఈ ఉత్తరువు వానికి అనువర్తింపజేయరాదను విషయమై కాదు. ఈలోగా తాత్కాలికంగా రామకృష్ణమిషన్, పచ్చయ్యప్ప ధర్మసంస్థల నిర్వహణలోనున్న పాఠశాలలకు పై ఉత్తరువును వర్తింపచేయ నవసరంలేదని డైరెక్టరు ఉత్తరువు చేసినారు. డైరెక్టరు ఉత్తరువును ప్రభుత్వం నిరాకరించింది. ప్రభుత్వం నిరాకరించులోగా హిందూధర్మసంస్థల నిర్వహణలోని పాఠశాలల పట్ల ప్రభుత్వం పక్షపాతం వహించుచున్నదని క్రైస్తవ బిషప్పులు పత్రికా ప్రకటన చేసిరి. ప్రస్తుతవిషయంలో పక్షపాతమేమీ చూపబడలేదు.

ఈసందర్భంలో విద్యాశాఖా మంత్రి క్రైస్తవులపట్ల నిందాపూర్వకంగా మాట్లాడరనీ, నిరాదరం చూపినారనీ, బిషప్పులు ప్రకటించినారు. అట్లు నిందాపూర్వకమైన మాటలు మాట్లాడవలసి వచ్చినందుకు చింతించుచూ మంత్రిగారు పశ్చాత్తాపమును ప్రకటించిరి. మంత్రిగారు పశ్చాత్తాపమును ప్రకటించినందువల్ల ఇంక ఈ విషయమును చర్చించదలచలేదనీ, అర్ధగంట కౌన్సిల్ చర్చ ఈ విషయంపై జరుపవలెనని సూచించుచూ తాము ప్రతిపాదించ దలచిన తీర్మానమును ప్రతిపాదించుట లేదనీ, ఈ చర్చ నింతటితో ముగించుచున్నారనీ డా॥ జాన్‌గారు ప్రకటించిరి.

### ప్రాంతీయభాష, మాతృభాష,

విద్యాలయాలలో ఆరంభ తరగతులలో మాతృభాషలలోనే విద్యాబోధ జరుగవలెనని కేంద్రప్రభుత్వం చేసిన ఉత్తరువు మద్రాసు ప్రభుత్వానికి అందినదనీ, ఈ ఉత్తరువువలన ప్రాంతీయభాష అనుమాటకు బదులు ప్రభుత్వ ఉత్తరువు లన్నిటిలోనూ మాతృభాష అనుమాటను చేర్చు విషయమై రాష్ట్రప్రభుత్వం ఆలోచించుచున్నదనీ మంత్రి అవినాశిలింగంగారు శ్రీ ఆర్. సూర్యనారాయణ రావుగారి ప్రశ్నకు సమాధానమిచ్చిరి. అయితే ప్రాథమిక పాఠశాలల్లో మాత్రమే మాతృభాష నుపయోగించవలెనని కేంద్రప్రభుత్వం నిర్ణయించుచున్నది గాని మాధ్యమిక పాఠశాలల్లో (సెకండరీస్కూల్స్) ప్రాంతీయభాష కు వారు అభ్యంతరపెట్టుట లేదనీకూడా చెప్పిరి.

ప్రశ్న: సర్వపాఠశాలల్లోనూ మాతృభాషయే విద్యాబోధకు వినియోగింపవలెనని కేంద్రప్రభుత్వం స్పష్టమైన ఉత్తరువులను పంపిన మాట నిజమేనా?—స్పష్టమైన ఉత్తరువులేదు.

---

మీరట్, నవంబర్ 22: వచ్చేనెలలో ప్రారంభము కానున్న జయపూర్ కాంగ్రెస్‌కు పంపు కృపరగద్దా కాంగ్రెస్ అధ్యక్షులు పి. డి. టాండన్‌గారు మీరట్‌లో అఖండజ్యోతిని వెలిగించిరి. కడచిన అఖిలభారత కాంగ్రెస్ సమావేశము మీరట్‌లో జరిగినది. ఆ యఖండజ్యోతి మీరట్‌నుండి బయులుదేరి అచ్చటికి 7 మైళ్ళ దూరమునందున్న ఒక గ్రామమునకు చేరినది. ఈ జ్యోతి అటనుండి జయపూర్‌కు చేర్చబడును.

## ధాన్యం, బియ్యం ధరల హెచ్చింపు

చెన్నపట్నం, నవంబరు 23: రాష్ట్రప్రభుత్వం ధాన్యం ధరలను, బియ్యంధరలను హెచ్చుచేయుచూ ప్రకటన చేసినది. దాదాపు సరిమానుకు ధాన్యంధర రు 1-6-0 లు గో॥ న పెంచబడినది. దీనివల్ల కొనుగోలుదార్లు కొనుబడి ధర రు. 2 లకంటే మించకుండా ప్రభుత్వం జాగ్రత్త వహించింది.

### ధాన్యం ధరలు

ఉభయగోదావరి, కృష్ణా గుంటూరు జిల్లాలలో మొదటిరకం ధాన్యం.

| | |
|---|---|
| కళ్ళంలో ధర మానుకు | రు. 8- 9-6 |
| ఎక్సుమిల్లు ధర | 9- 5-6 |
| ఎఫ్. ఓ. ఆర్. ధర | 9- 6-3 |
| హోల్‌సేలు ధర | 9-11-0 |
| రెండవ రకం. | |
| కళ్ళంలో ధర | 8- 2-3 |
| ఎక్సుమిల్లు ధర | [illegible]-14-3 |
| ఎఫ్. ఓ. ఆర్. ధర | 8-15-0 |
| హోల్‌సేల్ ధర | 9- 3-6 |
| నెల్లూరుజిల్లా మొదటిరకం ధాన్యం | |
| కళ్ళంలో ధర | 8-14-9 |
| ఎక్సుమిల్లుధర | 9-11-0 |
| ఎఫ్. ఓ. ఆర్. ధర | 9-11-9 |
| హోలుసేలుధర | 10-0-6 |
| రెండవరకం | |
| కళ్ళం ధర | 8-2-3 |
| ఎక్సు మిల్లుధర | 8-14-3 |
| ఎఫ్. ఓ. ఆర్ ధర | 8-15-0 |
| హోలుసేలుధర | 9-8-6 |
| ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో మొదటిరకం బియ్యం. | |
| ఎక్సుమిల్లు ధర | 12 15-6 |
| ఎఫ్. ఒ. ఆర్‌ధర | 13-0-3 |
| హోలుసేలు ధర | 13-6-3 |
| రెండవరకం | |
| ఎక్సు మిల్లుధర | 12-5-3 |
| ఎఫ్. ఓ. ఆర్‌ధర | 12-6.0 |
| హోలుసేలు ధర | 12-12-0 |
| నెల్లూరుజిల్లాలో మొదటి రకం బియ్యం | |
| ఎక్సుమిల్లు ధర | 13-6-9 |
| ఎఫ్. ఓ. ఆర్ ధర | 13-7-6 |
| హోలుసేలు | 13-13-0 |
| రెండవ రకం | |
| ఎక్సుమిల్లు ధర | 12-5-3 |
| ఎఫ్. ఓ. ఆర్. ధర | 12- 6-0 |
| హోలుసేలు ధర | 12-12-0 |

పై ధరలన్నీ మణుగు ధరలు మాత్రమే. ఈ ధరలు నవంబరు 21 నుండి అమలులోకి వచ్చును.

## మేయరు ఎన్నిక

చెన్నపట్నం, నవంబరు 23: చెన్నపట్నం కార్పొరేషనుకు మేయరును ఎన్నుకొనుటకు నేడు కార్పొరేషను సభ్యుల సమావేశము ప్రస్తుత మేయరు యం. కృష్ణారావుగారి అధ్యక్షతను నేడు మధ్యాహ్నము 2-45కు ప్రారంభమయ్యెను. మొత్తం సభ్యులు 85గురు హాజరైరి. ముందులోపాయకారీ ఎన్నిక రహస్యముగ జరుగుచున్నది. ఇందుకు ఎస్. రామస్వామినాయుడు, గుంటూరు నరసింహారావు, పి. మార్తాండంపిళ్ళె, ఆర్కాటు కృష్ణస్వామిగార్లకు పోటీ జరుగుచున్నది. జి. రాజమన్నారు చెట్టిగారు కూడ పోటీ చేయుదురని మొదట అనుకొనబడెను. గాని, చివరకి వారిపేరు రాలేదు. ఈ లోపాయకారీ ఎన్నికలలో నెగ్గినవారిని, తర్వాత బహిరంగముగ, ఏకగ్రీవముగ ఎన్నుకొనుట జరుగును.

మొదటి రెండు ఎన్నికలు జరిగినప్పుడు గుంటూరు నరసింహారావుగారికి 27, రామస్వామినాయుడుగారికి 25, డా॥ కృష్ణస్వామిగారికి 14, మార్తాండం పిళ్ళెగారికి 18 ఓట్లు వచ్చినవి. చివరి ఆతను పోగా మిగిలిన ముగ్గురికి రెండవ రెండు ఎన్నికలు జరుగును.

## డా॥ పట్టాభి జన్మదినోత్సవం

చెన్నపట్నం, నవంబరు 23: అఖిల భారతకాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైన డా॥ పట్టాభి సీతారామయ్యగారి 69-వ జన్మదినోత్సవం రాజాజీహాలులో 24-వ తేదీ సాయంకాలం 5 గం. 30 ని. లకు ఆచార్య ఎన్. జి. రంగాగారి అధ్యక్షతను జరుగును. శ్రీయుతులు కళా వెంకట్రావు, కామరాజ్ నాడార్, మాధవ మీనన్, చెన్నపట్నం షరీఫ్, డా॥ యం. కృష్ణారావు, గోపాలరెడ్డి, ఎం. కె. వి. రెడ్డి నాయుడుగార్లు ఉపన్యసించెదరు. శ్రీమతి బాలసరస్వతీదేవిగారిగానం శ్రీ వేమూరి సూర్యనారాయణగారి ఏకపాత్రాభినయం ఉండును.

పచ్చయప్ప హైస్కూలులో 24-వ తేదీ సాయంత్రం 4 గంటలకు నూతన రాష్ట్రపతి డా॥ పట్టాభిగారి జన్మదినోత్సవము జరుగును. బులుసు సాంబమూర్తిగారు అధ్యక్షత వహించెదరు.

### ఆంధ్ర విజ్ఞాన సమితి

డా॥ పట్టాభి సీతారామయ్యగారి జన్మదినోత్సవము. 21-11-48 సాయంత్రం 5-30 గంటలకు అధ్యక్షులు: కల్లూరి చంద్రమౌళి.

# నూరింట 2 వంతులు ఈనాములే మినహా యించబడగలవు

## కౌన్సిల్‌లో రెవిన్యూమంత్రి వెంకట్రావుగారి ప్రకటన

### జమీందారీరద్దు బిల్లుపై క్లాజువారీ చర్చ

చెన్నపట్నం, నవంబరు 23: ఈ రాష్ట్రంలోని మొత్తం ఈనాములలో నూరింట 2 వంతులలో మాత్రమే ఈనాం దార్లకు మేలువరం, కుడివరం హక్కులు రెండూ ఉన్నవనీ, మిగతా 98 వంతుల ఈనాములకూ జమీందారీ రద్దు శాసనం వర్తించుననీ రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు నేడుదయం మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ప్రకటించిరి. నేడుదయం 11 గంటలకు కౌన్సిల్ శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారి అధ్యక్షతను సమావేశమైనప్పుడు ప్రశ్నల కాలానంతరం జమీందారీ రద్దు బిల్లుపై క్లాజువారీ చర్చ ప్రారంభ మయింది.

శాసనం అంతటిలోనూ "ఈనాం" "ఈనాంగ్రామములు," ఈనాం ఎస్టేటు అను పదములను, ఈనాములకు సంబంధించిన క్లాజులన్నిటినీ, తొలగించవలెనని డా॥ వి. కె. జాన్‌గారు ఒక సవరణను తొలగించిరి. ఈనాందార్లకు ఈనాం భూములపై సర్వహక్కులూ ఉన్నవని నిరూపించుటకు డా॥ జాన్‌గారు హైకోర్టు తీర్పులను ప్రివీ కౌన్సిల్ తీర్పులను చదివి వినిపించిరి. యాజమాన్యపు హక్కులు కలిగియున్న ఈనాందార్లను జమీందార్లతో చేర్చి వారి ఆస్తులను స్వాధీన పర్చుకొనుట శాసన విరుద్ధమని చెప్పిరి. ఈనాందార్లు జమీందార్లవలెనే ప్రభుత్వానికి ఉత్పత్తిదారులకూ మధ్య దళారీలని చెప్పుట తప్పనీ, ఇది తప్పని అంగీకరించినచో ఈనాములను ఈ శాసనంలో చేర్చుట అక్రమమని బోధపడ గలదని చెప్పిరి.

యాజమాన్యపు హక్కులుకూడా గల వారి ఆస్తులను స్వాధీనపర్చుకొనరాదని తలచినందుననే, 1936 ఈనాములను ప్రభుత్వం మినహాయించినారు కదా అని అధ్యక్షులు శ్రీ రామకృష్ణ రాజుగారు ప్రశ్నించిరి. 1908 ఈనాములకు (ఎస్టేట్సులాండ్ ఆక్టు ప్రకారం) కుడివరం హక్కులు మాత్రమే ఉన్నదని స్పష్టముగా ట్రిబ్యునల్సు తీర్పులలోనూ, కోర్టుల తీర్పులలోనూ నిర్ణయింపబడినందున వానిని ఇప్పుడు మినహాయించుచున్నారని మంత్రి కళా వెంకట్రావుగారు చెప్పిరి.

1936 ఎస్టేట్సులాండ్ ఆక్టు సవరణ వచ్చినప్పటికీ ఇతర ఈనాందార్లలో అనేకమంది తమకు మేలువరం హక్కులే కాక కుడివరం హక్కులు కూడా ఉన్నవో లేవో ధృవపరచుకొనజాలక పోయినారు. కుడివరం హక్కులు గలవారిని కూడా మేలువరం హక్కుదార్లలో చేర్చి వారి ఆస్తులను స్వాధీనపర్చుకొనుటకు కొందరు ప్రతికూలత కనపర్చినందున, 1936 ఈనాములను మినహాయించవలసి వచ్చినది. ఇప్పుడు ఈ ఈనాముదార్లు మేలువరం హక్కులమాత్రమే ఉన్నవో, కుడివరం హక్కులు కూడా ఉన్నవో ట్రిబ్యునల్సు సమక్షంలో నిరూపించుకొనవలసి యున్నదని మంత్రిగారు చెప్పిరి. ప్రస్తుత శాసనంలో "ఈనాం ఎస్టేటు" అనగా మేలువరపు హక్కులమాత్రమే గల ఈనాందార్ల ఈనాములని నిర్వచింపబడింది. ఈనాములు ఈనాంగ్రామములు అను పదములు రెండురకాలకు చెందును. అందువలన అన్నిరకముల ఈనాములను ఈ శాసనమునుండి మినహాయించవలెననీ తమ ఉద్దేశమైనట్లు డా॥ జాన్‌గారు చెప్పిరి. అనేకమంది యీనాందార్ల హక్కులేవో ధృవపడలేదు. 1936 ఈనాములని చెప్పబడువానిలో రెండువారం హక్కులున్న వెన్నో తెలియదు.

ఈ సందర్భంలో ఈనాములన్నిటిలో చాలా కొద్ది ఈనాముల హక్కులు నిరూపించబడినవనీ, మొత్తం ఈనాములలో నూరింట 98 వంతుల వానికి మేలువరం హక్కులమాత్రమే ఉన్నవనీ, మిగతా రెండువంతులకు మాత్రమే ఉభయ హక్కులూ ఉన్నవనీ, నూరింట ఈ రెండువంతులే ఈ శాసనమునుండి మినహాయించబడుననీ మంత్రి వెంకట్రావుగారు చెప్పిరి. కుడివరం హక్కులున్నవో లేవో పూర్తి పరిశీలన కానిదే ఈనాములకు ఈ శాసనమును వర్తింపచేయుట న్యాయము కాదని డా॥ జాన్‌గారు చెప్పిరి. కాంగ్రెస్‌పార్టీ సభ్యులలోకూడా అనేకులు ఈనాములను ఇప్పుడు ఈరీతిగా రద్దుపరచుటకు విముఖులనీ, పార్టీ నియమములను సడలించి, కాంగ్రెస్ సభ్యులను స్వేచ్ఛగా వోటుచేయ నిచ్చినచో ఈ శాసనానికి ఎంత అంగీకారం ఉన్నదో తెలియగలదని చెప్పుచూ అట్టి స్వేచ్ఛ నియ్యగలరా అని డా॥ జాన్‌గారు రెవిన్యూ మంత్రిగారిని సవాలు చేసిరి. అబ్దుల్ లతీఫ్ ఫరూఖీగారు సవరణను బలపర్చిరి. శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు ఈ శాసనములో చేరినచో ఈనాములన్నిటినీ చేర్చవలెననీ, లేనిచో, అన్నిటినీ మినహాయించవలెననీ, అట్లైనచో ఈనాముల నిమిత్తం ప్రత్యేక శాసనం చేయవలెననీ చెప్పిరి.

రెవిన్యూమంత్రి వెంకట్రావుగారు సమాధానమిచ్చుచూ 1936 ఈనాములలో వారం హక్కులకు సంబంధించి వివాదములు నడచుచున్నవని [illegible] కొందరు ప్రభుత్వమునకు [illegible] తెచ్చినారనీ, అదిలేనిచో అన్ని ఈనాములనూ చేర్చుట తమ అభిమతమని [illegible] ఈనాందారుల హక్కులు [illegible] చుటను, 1936 ఈనాము అయినప్పటికీ, ట్రిబ్యునల్ పరిశీలించి [illegible] 9వ క్లాజు చేర్చబడిందనీ, చెప్పిరి. డా॥ జాన్‌గారు సవరణ నుపసంహరించుకొనక నిరాకరించి కాంగ్రెస్ పక్షసభ్యులెట్లు వోటుచేయ్యగలరో తెలుసుకొనగోరుచున్నట్లు తెలిపిరి. సవరణ వీగిపోయింది.



# ఎన్నికలలో మోసము, ప్రభుత్వ ఒత్తిడి

## ఫ్రెంచి ఇండియా ప్రభుత్వ వైఖరి

### కాంగ్రెస్ కార్యదర్శి విమర్శ

పుదుచ్చేరి, నవంబరు 22: ఫ్రెంచి ఇండియాలో యిటీవల జరిగిన ఎన్నికలు కృత్రిమమువల్లను, ఫ్రెంచిప్రభుత్వమువారి ఒత్తిడివల్లను కలుషీకృతమయ్యెనని పుదుచ్చేరీ పట్టణకాంగ్రెసు సంఘ కార్యదర్శి శ్రీ డి. మునిస్వామిగారు ఒక ప్రకటనలో ఉద్ఘాటించుచున్నారు. అనవసరముగు లాంఛనలేమియు లేకుండా వెంటనే భారత యూనియనులో కలిసిపోవ ఫ్రెంచి ఇండియా ప్రజలు వాంఛించుచున్నారని ఆయన చెప్పుచు హెచ్చు అధికారము విరోపియుల హస్తగతము గావింపబడుచుండుటయు, ఫ్రెంచి-ఇండియా ఫ్రెంచి అధికారులనుయము గావింపబడుచుండుటయు జుగుప్సాకరముగా నున్నదనుచున్నాడు. ఫ్రెంచి ఇండియాతో గావించుకొనియుండిన ఒడంబడికను రద్దుచేసి దానిస్థానే ప్రజలకు స్వాతంత్ర్యమును గ్యారంటీచేయు క్రొత్త ఒడంబడికను చేసికొనవలెనని మునిస్వామిగారు ఇండియా ప్రభుత్వమువారిని కోరుచున్నారు. (అ. ప్రె)

## ఫ్రెంచి ప్రభుత్వానికి గవర్నర్ విజ్ఞప్తి

పుదుచ్చేరి, నవంబరు 23: ఫ్రెంచి ఇండియా గవర్నర్ తన మంత్రివర్గమును ఆగ్గురు సభ్యులనుండి 10 మందికి విస్తరింపజేయుటకు అనుమతి ఇవ్వవలసినదని ఫ్రెంచిప్రభుత్వమును కోరినట్లు తెలియుచున్నది.

## గవర్నర్ సెలవు

డిసెంబరు మూడవవారంనుండి ఫ్రెంచి ఇండియా గవర్నర్ సెలవులో పోవుచున్నట్లు అసోసియేటెడ్ ప్రెస్‌కు తెలియుచున్నది.

ఫ్రెంచి ఇండియా పోలీసులు పుదుచ్చేరిలోని మాహిప్రజల 'క్లబ్' భవనమును సోదాచేసిరి. ఆక్షేపణీయమైనవేమీ దొరకలేదు.

# కాశ్మీర్ కమిషన్ నివేదిక

(1-వ పేజీ తరువాయి)

ప్రయోజనమునే భంగపరచునట్టిదిగా నుండెను. అందువల్ల పాకిస్తాను సేనలు పోరాటమును నిలిపివేయుటగాని పోరాటం నిలిపిన అనంతరము సాగింపవలసిన సంప్రదింపులను ప్రారంభించుటగాని సాధ్యపడలేదు. ఇండియా ప్రభుత్వముతోను, పాకిస్తాన్ ప్రభుత్వముతోను స్వతంత్ర కాశ్మీరు ఉద్యమ నాయకులతోను యీ కమిటీ సభ్యులు సంప్రతింపులు జరిపిరి.

కాశ్మీరులోనుండియు జమ్మూనుండియు దుండగీండ్రను కొండజాతుల వారను, పాకిస్తాను వాసులను వెడలిపోవునట్లుగా చేయునని పాకిస్తాన్ ప్రభుత్వము తన పలుకుబడిని తన అధికార సామర్థ్యమును వినియోగించవలసినదిగా పాకిస్తాన్ ప్రభుత్వమును ఒప్పించగలమని ఆశించితిమి. ఆ పని నెరవేరిన అనంతరము కాశ్మీరులో సివిలు పరిపాలన సక్రమముగా సాగుటకు ఏ పాటి కనీసపు సైన్యము మాత్రము అక్కడ ఉండవలెనో ఆ కనీసపు సైనికబలమునే అక్కడ ఉంచవలసినదిగాను, మిగతా సైన్యమును అచటి నుండి క్రమక్రమంగా తొలగించవలసినదిగాను ఇండియా ప్రభుత్వమును ఒప్పించదలంచితిమి. అటుపిమ్మట, భద్రతా మండలి తన తీర్మానములో సూచించిన పద్ధతి ప్రకారముగా కాశ్మీరులో జనవాక్యనిర్ణయము చేయుటకై వోటింగు జరుపునట్లుగా ఇండియా గవర్నమెంటును సమ్మతింపజేయదలంచితిమి.

కాశ్మీరు స్వతంత్ర రాజ్యంగానే ఉండవలెనని కోరుచు "ఆజాదు కాశ్మీరు" ఉద్యమము ప్రభుత్వముపై ఒకతిరుగుబాటుగా బయలుదేరినది. ఆజాదు కాశ్మీరుపక్షమువారి తరఫున పోరాడుచుండిన సేనలు పాకిస్తాను ప్రభుత్వముయొక్క సైన్యాధిపత్యముక్రిందనే పోరాడుచున్నవనియు, ఆజాదు సేనల యుద్ధతంత్రమునంతను కాశ్మీరు ప్రభుత్వమే నడిపించుచున్నదనియు, పాకిస్థాన్ ప్రభుత్వము ఒప్పుకొన్నది. ఆ సందర్భపరిస్థితి యీ కమిటీ ఊహించి యుండని అంశముగా కన్పించినది.

ఇండియా ప్రభుత్వముతోను, పాకిస్తాన్ ప్రభుత్వముతోను యీ కమిటీ సభ్యులు సంభాషించినపిమ్మట ఉభయపక్షముల అభిప్రాయవైఖరి యీ క్రింది రీతిగా విశదమయ్యెను:

(1) పాకిస్థాను సేనలు కాశ్మీరులో ఉండటం అక్రమమైన వ్యగ్రచర్యగా ఇండియా ప్రభుత్వం భావించుచున్నది. కాశ్మీరు విషయములో స్థిరమైన వ్యవహార పరిష్కారము జరుగుటకై రాయబారములను సాగించుటకు పూర్వం కాశ్మీరులోని పాకిస్థాను సేనలు తొలగింపబడవలెనని ఇండియా ప్రభుత్వము పట్టుదల వహించింది.

(2) కాశ్మీరులోనుండి ఇండియా ప్రభుత్వ సేనలు ఏకకాలమందే ఒక నిర్ణీత క్రమము ననుసరించి కాశ్మీరునుండి తొలగింపబడిననే తప్ప పాకిస్థాను సేనలు తొలగింపబడజాలవు. పోరాటమును విరమించు విషయమై సంప్రతింపులను జరిపే యెడల కాశ్మీరు గవర్నమెంటు" అనబడే ప్రభుత్వంతోకూడా సంప్రతింపులు జరగవలెనని పాకిస్థాను పట్టుదల వహించెను.

భద్రతామండలి తీర్మానంలో సూచింపబడిన వ్యవహార క్రమము ప్రకారముగా, ప్రప్రథమమున పాకిస్థాను సేనలు కాశ్మీరునుండి తొలగింపబడవలెనని పాకిస్థానను కోరవలసి యున్నదని యీ కమిటీ భావించెను. రెండవ మెట్టుగా ఇండియా ప్రభుత్వ సేనలలో చాలాభాగము కాశ్మీరునుండి తొలగింపబడుట జరుగవలెనని యీ కమిటీ భావించెను.

ఉభయపక్షముల మధ్య తాత్కాలిక యుద్ధవిరామము ఏర్పాటుకు జరుగవలసిన షరా పరతులను యీ కమిటీ సూచించెను. ఆ షరతులు ఇండియా ప్రభుత్వానికి పాకిస్తానుకుకూడా అంగీకారయోగ్యముగా నుండునని యీ కమిటీ తలంచెను కాశ్మీరు సంస్థానములోనుండి పాకిస్తాను సేనలు ముందుగా తొలగింపబడిననే తప్ప, అనంతర కర్తవ్యమునుగూర్చి ఇండియా గవర్నమెంటు ఏమియు ఆలోచింపజాలదని ఇండియా ప్రభుత్వము అప్పుడు యీ కమిటీకి తెలియజేసెను. ఉభయపక్షములకు కలహము లేకుండా నివృత్తి అయిన పిమ్మటనే, కాశ్మీరు ప్రజలు పాకిస్తానులో చేర గోరుచున్నారా, ఇండియాలో చేరగోరుచున్నారా అనేవిషయమై ప్రజాభిప్రాయమును [illegible] వోటింగు జరుపుటకు ఇండియా ప్రభుత్వము పట్టుదల వహించెను.

[illegible] పాకిస్తాను ప్రభుత్వము [illegible] పాకిస్తాను [illegible] నకు ఉపక్రమించుటకు ముందుగా, ఇండియా ప్రభుత్వ సేనలతోసహా, పరాయివారందరూ కాశ్మీరునుండి తొలగిపోవలెను. కాశ్మీరునుండి ఇతర ప్రాంతములకు పారిపోయిన ముసల్మానులందరును తిరిగి కాశ్మీరులో పునరావాసులు కావలెను. జమ్మూ కాశ్మీరులలో పరిపాలన సాగించుటకు నిష్పాక్షిక స్వతంత్ర ప్రభుత్వమొకటి ఏర్పాటు చేయబడవలెను.

ఏమైనప్పటికీ యీ సంవత్సరము జనవాక్యనిర్ణయము జరుపుటకు సాధ్యము కాదని ఉభయపక్షములు అంగీకరించెను. కాశ్మీరుప్రభుత్వముయొక్కయు, ఆజాదు కాశ్మీరునాయకుల యొక్కయు అభిప్రాయముకూడా ఆ రీతిగానే తెలియజేయబడెను.

కనుక, యీ జనవాక్యనిర్ణయము ఏవిధముగా జరుగవలెననే విషయమై యీ కమిటీ ఏవిధమైన పథకమును ఇప్పుడు సూచించుటలేదు. ప్రజాభిప్రాయమునుమాత్రము నిష్పారణగా తెలిసికొనవలసియున్నది కాని అది ఏవిధముగా జరుగవలెనను విషయములో ఉభయపక్షములకు అంగీకారయోగ్యమైనపద్ధతిని నిరూపించుటకు అవకాశము నొసంగ దలంచితిమి.

అజాదు కాశ్మీర్ ఉద్యమము అనేది రాజకీయ ఉద్యమమేగాక సైనికపటాలములతోకూడా పనిచేయుచున్నది. పాకిస్తాను సైనికాధిపతుల సహాయముతో వర్తించుచున్నది. ఇప్పుడు కాశ్మీరులో వున్న ప్రభుత్వముపై తిరుగుబాటు సాగించుచున్నది.

1947 సం॥ అక్టోబరుమాసమునుండియు యీఅజాదు కాశ్మీరుసేన గుండగీండ్రయిన కొండజాతులవారితోను పాకిస్తానునుండి దండెత్తివచ్చిన పాకిస్తానుసైనికులతోను సహకరించుచున్నది. ఈ అజాదు కాశ్మీరు సేనలవశమందు కాశ్మీరులోను జమ్మూలోను చేరిన చాలా భాగములు —ందు ముఖ్యముగా పూంచ్, ముజఫరాబాదు, మీరు పూరు జిల్లాలు కలవు. అజాదు కాశ్మీరు సేనల వశమందున్న ప్రాంతములో 10 లక్షల మొదలు 20 లక్షల వరకు ప్రజలు కలరు. అజాదు సేనలన్నియు పాకిస్తాను సైన్యాధిపత్యముక్రింద నేవుండి యుద్ధము చేయుచున్నవి. [illegible] పాకిస్తాను ప్రభుత్వము అంగీకరించినది.

ఈ నివేదికకు [illegible] అనుబంధము [illegible] వు. ఈ నివేదికపై కమిటీ సభ్యులైన [illegible]

# పాలస్తీనా విభజనకు బర్నాడోట్ సూచనలు

## సోవియట్ రష్యా నిరాకరణ

ప్యారిస్, నవంబరు 22: బర్నాడోట్ గావించియుండిన సూచనలను నేడు సోవియటు ప్రతినిధి రాజకీయ సంఘములో నిరాకరించెను. బ్రిటిష్, అమెరికన్ సత్తాదార్ల క్షేమమును దృష్టిలోనుంచుకొని ఈ సూచనలు గావింపబడెనని ఆయన చెప్పెను.

అరబ్బీ యూదురాజ్యముల ప్రభుత్వములు సంధిచేసికొని, శాంతి స్థాపించుకొనుటకు మధ్యవర్తి గావించిన సూచనలను సోవియటు రష్యా ఆమోదించుచుండెనని ఆయన చెప్పుచు అరబ్బీ యూదు రాజ్యములనుండి విదేశీయసైన్యముల నన్నిటిని ఉపసంహరించుట ఆత్యావశ్యకమనెను. గత సంవత్సరము జనరల్ ఎసెంబ్లీ గావించిన నిర్ణయమును రేఖా మాత్రమైనను అతిక్రమించకుండా అరబ్బీ యూదు రాజ్యములను నెలకొల్పవలెనని ఆయన చెప్పెను. యూదు రాజ్యముయొక్క ఎల్లలనుమార్చు విషయమై ఒక సంవత్సరము క్రిందట ఎసెంబ్లీ గావించిన నిర్ణయము యూదు రాజ్యస్థితికే భంగము వాటిల్లజేయునని ఆయన చెప్పెను.

పాలస్తీనాలో నెగెవ్ ప్రాంతమున స్వల్పంగా పోరాటము జరిగెనని అచ్చటి నుండి వచ్చిన వార్తలు తెలుపుచున్నవి.

సోవియటురష్యా బెర్నాడోట్ సూచనలను నిరాకరించుటవల్ల సభవారి యెదుట మూడుభిన్నాభిప్రాయములున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ అభిప్రాయము లేవన: (1) బెర్నాడోట్ పథకమును బ్రిటను ఆమోదించుచున్నది. ఈపథకము ననుసరించి నెగెవ్ ప్రాంతము ట్రాన్సు జోర్డనుకును, పశ్చిమ గాలిలీయాదులకును ఒసంగబడును. జరూసలమ్ అంతర్జాతీయప్రాంతముగా చేయబడును. (2) అమెరికావారి వైఖరి నగేవు కొరకు, గాలిలో శాంతిప్రాంతముకొరకు బేరముచేయ యూదులు సిద్ధముగా నుండవలెనని అమెరికావారు అభిప్రాయపడుచున్నారు. మరికొన్ని దేశములుకూడ యిట్టి అభిప్రాయము కలిగియున్నవి. (3) రష్యావారివైఖరి విభజనవిషయమై మొదట అంగీకరించిన పథకమును జనరల్ ఎసెంబ్లీ ధృవపరుపవలెనని రష్యావారు కోరుచున్నారు. ఈ పథకముననుసరించి నెగెవ్ ప్రాంతము యూదులకు సంక్రమించును. పశ్చిమ గాలిలీ, జాఫ్నా రేవు అరబ్బులకు సంక్రమించును. యూదురాజ్యము, అరబ్బీరాజ్యము రెండు ప్రత్యేక స్వతంత్రరాజ్యము లగును.

# బొంబయిలో తుపాను బీభత్సం

(1-వ పేజీ తరువాయి)

ఉన్నత ప్రభుత్వాధికారులు, మంత్రులు పట్టణములో విధివిరామములేక తిరుగుచు, పాకిస్తాను శరణార్థులకై నిర్మింపబడిన చిన్నచిన్న గుడిసెల పరిస్థితి ఎట్లున్నదో పరిశీలించుటకు, వారిని సురక్షిత స్థానములకు చేర్చుటకు ప్రయత్నించుచున్నారు.

విద్యుచ్ఛక్తిపై ఆధారపడియున్న సమస్త కార్యకలాపములు నిలిచిపోయినవి. బొంబాయిద్వారా వచ్చే ప్రపంచ వార్తలుగూడ ఆగిపోయినవి.

## నగరమంతా చీకటి

35 లక్షలమంది నివసించే బొంబాయి నగరం నేటిరాత్రి అంధకారబంధురమై పోయినది. నగరమునకు బయటినుండి విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే 5 ప్రధాన మార్గములు తుపానుగాలికి ఛిద్రమై పోయినందున ఈ చీకటి సంభవించినది. బొంబాయి కింత ఘోర ప్రమాదము సంభవించుట కిదే తొలిసారి.

బొంబాయితీరమున ఉన్న చిన్న చిన్న పడవలు, కొన్ని స్టీమర్లు తలక్రిందు లైనవి. కాని ప్రాణ నష్టమేమీ జరిగినట్లు లేదు.

సగటున 60 మైళ్ల వేగంతో వీచుచున్న తుపాను నేటిరాత్రి 9-30 ని. లకు 80 మైళ్ల వేగమువరకూ పెరిగినది.

## పోలీసు జాగ్రత్తలు

నగరాన్నావరించుకొన్న అంధకారమును అవకాశం చేసుకుని ఎవరైనా దొంగతనాలకు, లూటీలకు, ఇతర నేరాలకు ఉపక్రమిస్తే, ఉన్నపాటున తుపాకి ప్రేల్చి చంపవేయబడుదురని పోలీసులు నేటి సాయంత్రం ప్రకటించిరి. సాయుధులైన పోలీసులు కార్లలోనూ, నడుస్తూనూ నగరమంతా గస్తీ తిరిగెదరని, అక్కడక్కడ గ్యాస్ లైట్లతో వెలుగు కలిగించబడుననీ కూడ ప్రకటింపబడినది. రోడ్డు కడ్డంగా పడిన చెట్లను, విద్యుచ్ఛక్తి స్తంభాలను తీసివేయుటకు సైనికులు, హోమ్‌గార్డులు రప్పింపబడిరి.

గేట్‌వే ఆఫ్ ఇండియా వద్దనున్న సముద్రపుగోడ నేడు కొంచెం దెబ్బతిన్నది. ఒక చిన్న నావను, అందులోని 12 గురు నావికులను ప్రాణ ప్రమాదము నుండి పైలు బ్రిగేడువారు రక్షించిరి. కొన్ని లలో ఎంత శ్రమను చేసినను ఇంకా ప్రజలు పోవుటకు, బస్సులు మున్నగునవి నడచుటకు వీలు లేకున్నది.

శాంతా క్రుజ్‌లోని 6 విమానములు, కొన్ని కట్టడములు దెబ్బతిన్నవని తెలియుచున్నది.

బొంబయి పత్రికలు యావత్తు నిలచి పోయినవి, "ఈవెనింగ్ న్యూస్ ఆఫ్ ఇండియా" పత్రికమాత్రం సైక్లోస్టయిలు ప్రతితో ఒకపేజీ సంచికను వెలువరించుచు తుపాను పరిస్థితిని వర్ణించినది.

## బొంబాయి మద్రాస్ ఎక్స్‌ప్రెస్ రద్దు

22 వ తేదీ మధ్యాహ్నం విక్టోరియా స్టేషనులో బయలుదేరి మరుసటిరోజు సాయంత్రం 8-10 గంటలకు మద్రాసు చేరవలసిన ఎక్స్‌ప్రెస్ బండి, తుపానుగాలి మూలంగా రద్దు చేయబడినట్లు, యం. యస్. యం., యస్. ఐ. రైల్వే పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్ ప్రకటించెను.

# గ్రామ పంచాయితీలకు ప్రధాన స్థానం

(1-వ పేజీ తరువాయి)

కరములుగాని, దానిని ప్రజలకందించు హక్కులుగాని వ్యక్తులచేతిలో కేంద్రీకృతము కారాదనియూ ఈ సవరణ చెప్పుచున్నది. వ్యాపారములో గత విధానము శాసనసభతో కూడియుండి ప్రజలకు అపకారము చేయునని ఆయన వాదించెను.

రాజ్యాంగ ముసాయిదా రచనకు వినియోగించిన భాషలో కే. టి. షా చెప్పినట్లు చేయుట సాధ్యము కాదనియు, ఒక ప్రయోజనము కొరకు ఆ భాష ఉపయోగించబడిన దనియు పరిశీలకులకు తెలియ రనవడు విస్పష్టముగా ఉన్నదనియు డా॥ అంబేడ్కరు చెప్పెను. సవరణ త్రోసివేయబడెను. నాజిరుద్దీన్ అహమ్మద్, సయ్యద్ అబ్దుల్ రౌత్‌గార్ల సవరణలు కూడా త్రోసివేయబడెను.

## గ్రామ పంచాయితీల సవరణ

తరువాత, నూతనరాజ్యాంగములో గ్రామ పంచాయితీల స్థానము గురించి చర్చ జరిగెను. ప్రభుత్వమువారు గ్రామ పంచాయితీలు నెలకొల్పి, వానికి స్వపరిపాలనాధికారము విచ్చునట్లు ఒక నూతన సూత్రమును ముసాయిదాలో చేర్చవలెనని కె. సంతానం ప్రతిపాదించెను. దీనికి పలువురెల్లరు అనుకూలురేననీ, భారత భవితవ్యము గ్రామములపై ఆధారపడి యుండవలెనని ఆయన చెప్పెను.

ఇంతకుపూర్వము ఇదే ఉద్దేశముగల ఒక సవరణను ఎచ్. వి. కామత్ ప్రతిపాదించియుండెను. సంతానంగారి సవరణపై టంగుటూరి ప్రకాశం, సురేంద్ర మోహన్ ఘోష్, సేట్ గోవిందదాస్, డా॥ సుబ్రహ్మణ్యం, భారతిగార్లు అనుకూలముగా ప్రసంగించిరి. గ్రామస్వరాజ్యములు సరిగా ఏర్పడి ఆత్మసమృద్ధితో వాని పరిపాలన సాగినచో ద్రవ్యోల్బణ నిరోధమున్నూ, దోపిడీ దొంగవ్యాపారముల వినాశనమున్నూ చేకూరగలవని ప్రకాశం చెప్పెను. భారతదేశములో గ్రామములు ఎప్పుడును ప్రత్యేకత గలవనియు, బ్రిటిషు పరిపాలన మూలముననే అవి నాశన మయినవనియు, గ్రామ పంచాయతీలను పునరుద్ధరించుటలో సి. పి. ప్రభుత్వము ముందడుగు వేసెననియు సురేంద్ర మోహన ఘోష్ చెప్పెను. సంతానంగారి సవరణను శ్లాఘించుచు మునిస్వామిపిళ్లే, డా॥ సుబ్రహ్మణ్యం, కృష్ణస్వామిభారతిగార్లు ప్రసంగించిన అనంతరము, ఈ సవరణ డా॥ అంబేద్కరుచే ఆమోదించబడి సభవారిచే ఏకగ్రీవముగా స్వీకరించబడెను.

# ట్రూమన్‌తో చర్చకు మార్షల్ ఆగమనం

## అమెరికా విదేశాంగ విధాన పరిశీలన

వాషింగ్‌టన్, నవంబరు 22: ట్రూమన్ అధ్యక్షుడితో అమెరికన్ విదేశాంగ విధానమును చర్చించి పరిశీలించుటకు విదేశ మంత్రి జార్జిమార్షల్ పారిస్‌నుండి నేడు ఇచ్చటికి వచ్చెను. అధ్యక్ష ఎన్నిక జరిగిన తర్వాత వీరిద్దరూ చర్చ జరుపుట ఇదే ప్రథమము. విశ్రాంతికై ఫ్లారిడా వెళ్లిన ట్రూమన్‌కూడ నిన్న నే వాషింగ్టన్ చేరెను. చైనా అంతర్యుద్ధములో ప్రభుత్వ సేనల స్థితి వీరు చర్చించు సమస్యలలో ప్రధానమైనది కాగలదు.

పారిస్‌లో ఐక్యరాజ్యసమితి సమావేశమునుగురించి మార్షల్ పత్రికా ప్రతినిధులతో ఇట్లనెను: "ఇప్పటివరకు జరిగిన దానినిబట్టి చాలావరకు ఏకాభిప్రాయము కుదిరినదనే నా అభిప్రాయము." సమితి ఏమైన వెనుకంజ వేయుచున్నదా అనగా ఆ విషయము తనకు తెలియదనెను.

# సవరణ

మంగళవారం పత్రికలో ప్రకటించిన ఆచార్య రంగాగారి ఉపన్యాసములో ధాన్యం బస్తా ధర 13-8-0 నుంచి 15 కు పెంచాలని వచ్చియున్నది. రంగాగారు కోరినది ధర 18-0-0 వరకూ పెరగాలని కనుక 15-0-0 అని ఉన్నచోట్ల రు. 18 లు. అని సవరించవలెను.

# పేరాలలో చేనేతవారి ఆకలి మరణాలు

## జిల్లా ఉద్యోగుల విచారణ

పేరాల, నవంబరు 21: పేరాలలో గోలి [illegible]మ్మ, గోలి సుబ్బమ్మ అను వారలు పనిలేక, పొట్ట గడవక ఆకలితో మరణించిరని గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్ కార్యదర్శి అక్కల కోటయ్య గారు చేసిన ఫిర్యాదులపై జిల్లా కలెక్టరు టి. ప్రభాకరరావు నాయుడు, స్థానిక డిప్యూటీ తాసిల్దారు అద్దంకి వెంకటరావు, జిల్లా కోఆపరేటివ్ డిప్యూటీ రిజిస్ట్రారు టి. వి. రత్నంగార్లు గత బుధవారంనాడు పేరాలవెళ్ళి సంగతి సందర్భములు తెలిసికొనిరి. ఈ విషయమై సమగ్ర విచారణ జరిపి, నివేదిక పంపమని స్థానిక డిప్యూటీ తాసిల్దారుగారికి కలెక్టరుగారు చెప్పిరి. పిమ్మట కలెక్టరుగారు రిజిస్ట్రారు గారితో కలసి, చేనేతవారిని కొందరిని కలుసుకొని వారి స్థితిగతులు అడిగి తెలుసుకొనిరి. సహకార నూలు ఎంపోరియముకు వెళ్ళి నూలు నిల్వలు తనిఖీ చేసిరి.

పేరాల ఆంధ్రరత్న యువజన కాంగ్రెస్ వారు ఈ మరణించినవారి కుటుంబములకు సహాయార్థము విరాళములు పోగు చేయుటకు ఏర్పాట్లు చేయుచున్నారు.

పైన చెప్పిన ఇద్దరేగాక, మరిద్దరు తిండిలేక చనిపోయినారని, అందులో ఒకరు కొత్తగా నీరాటిన స్త్రీ అని అక్కల కోటయ్యగారు తెలిపిరి.

## రైతు కాంగ్రెస్ ఇత్యాది సంఘముల సంయుక్త సమావేశం

విజయవాడ, నవంబరు 20: కాంగ్రెస్ వ్యవసాయ సంస్కరణల సంఘమువారు యీనెల 30, డిసెంబరు 1వ తేదీలలో విజయవాడ రానున్నారు. కాంగ్రెస్ వ్యవసాయక విధానము విషయములో కమిటీవారి ప్రశ్నావళి కిచ్చుటకు సమాధానములు నిర్ణయించుకొనుటకుగాను, ఆంధ్రరాష్ట్ర రైతుకాంగ్రెస్, వ్యవసాయకూలీ కాంగ్రెస్, ధాన్యము, నూనెగింజలు, పొగాకు, చెఱుకు ఉత్పత్తిదార్ల సంఘముల, జమీన్ ఇనాము రైతుసంఘముల కార్యవర్గ సంయుక్త సమావేశము యీనెల 28 ఉదయము 11 గంటలకు విజయవాడలోని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయములో జరుగును గాన సభ్యులందరు తప్పక విచ్చేయవలెనని ఆంధ్రరాష్ట్ర రైతుకాంగ్రెస్ అధ్యక్షుడు ప్రకటించుచున్నారు.

## విద్యార్థి జలగండం

రాజమహేంద్రవరం, నవంబరు 20: ఇచ్చటి నవభారతి గురుకులం ఉపాధ్యాయులు విద్యార్థులను పోలవరం ప్రాజెక్టు స్థలమునకు విహారమునకు తీసికొని వెళ్లుచు దారిలో పట్టిసీమ వద్ద గోదావరిలో స్నానముచేయుచుండగా మె. ట్రిక్యులేషన్ చదువుచున్న కె. శివశంకర రాజు అను విద్యార్థి నదిలో మునిగి ప్రమాదవశమున మరణించెను. ఎంత వెతికినా కళేబరము కూడ కన్పించలేదట. తక్కిన విద్యార్థులు ఉపాధ్యాయులు పోలవరంవెళ్ల కుండగనే తిరిగి వచ్చిరి.

## కీ॥ శే॥ [illegible]బహదూర్ శ్రీనివాసాచారిగారు

తిరుపతి, నవంబరు 21: గవర్నమెంటు మాజీ ప్రొఫెసర్‌గా నుండిన నెల్లూరు [illegible]బహదూర్ శ్రీనివాసాచారి గారు నిన్న [illegible] మద్రాస్ రాయపేట ఆస్పత్రిలో కీర్తిశేషులైరి. ఉద్యోగమునుండి పెన్షన్ పుచ్చుకొని సంస్కృత కాలక్షేపములు చేస్తుండిరి. కొన్ని దినములుగా అస్వస్థతవల్ల మద్రాసుకు చికిత్సకు తీసుకొని పోబడిరి. వారికి వయస్సు 57. వారికి ఇద్దరు కుమార్తెలున్ను, భార్యలున్ను, ఇంక అనేక బంధుమిత్రులు నున్నవారు. స్వ.వి.



# "కంట్రోలు పద్ధతులను రైతులు సహింపరు"

## ప్రొఫెసరు రంగాగారి ప్రకటన

మద్రాసు, నవంబరు 22: అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులగు ప్రొఫెసర్ యన్. జి. రంగాగారు నేడు మద్రాసులో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచు యీక్రిందివిధిగా చెప్పెను.

ఫ్యాక్టరీల ఆసాముల యొక్కయు, బస్తీ నివాసులయొక్కయు లాభాపేక్షముల నిమిత్తమై వారిని తృప్తిపరచుటకై గవర్నమెంటువారు తిరిగి కంట్రోలుపద్ధతులున్నూ ధాన్యసేకరణపద్ధతులున్నూ అమలుపరచుటకు గ్రామాలలోని ప్రజలు ఎంతమాత్రము అంగీకరించుటలేదు. ఈ కంట్రోలు పద్ధతులను అమలుపరచే యెడల సత్యాగ్రహంచేసి ధిక్కరించుటకు సిద్ధమగుచున్నారు. ధాన్యోత్పత్తిదారుల సభలు అనేకము రాయలసీమయందును, ఉత్తర సర్కారులందును జరిగియుండెను. కంట్రోలు పద్ధతులను తిరిగి అమలుపరచుటకు ఎంతమాత్రము అంగీకరింప జాలమని రైతులు ఆ సభలలో తీవ్రముగా ఆందోళనచేసిరని అనేక కిసాను సంఘముల నుండి నాకు లేఖలువచ్చినవి. రెండు మణుగుల తూకంగల వడ్లబస్తా 1 కి రూ 18 లు చొ॥న అధికపంటగల మిగులు జిల్లాలలోను రూ 20 లు చొ॥ తక్కువ పంటగల తరుగు జిల్లాలలోను గవర్నమెంటు వారు రైతులకు యిచ్చే పద్ధతి మీద ధాన్య సేకరణ విధానమునకు అంగీకరించవలసినదనే రాజీ షరతుకు కూడా రాయలసీమ రైతులు అంగీకరించుటలేదు. పైజెప్పిన రేట్లుగాక మేలుగకపు వడ్లకు హెచ్చు ధరలు కూడా యివ్వబడుననిన్ని పంట పండించిన రైతులకు వారి సొంత వినియోగానికి ఉంచుకొన దగిన ధాన్యంగాక మిగిలిన హెచ్చు ధాన్యంలో నూటికి 15 మొదలు 20 వంతు వరకు వారు తమ యిష్టానుసారంగా అమ్ముకొనుటకు అనుమతి యివ్వబడుననిన్ని సూచించబడినప్పటికీ రాయలసీమ రైతులు అట్టి రాజీపద్ధతికి అంగీకరించుటలేదు. రైతులకు కావలసిన యితర జీవితావసర వస్తువులను కంట్రోలు రేట్లప్రకారము గవర్నమెంటు వారు సప్లయిచేస్తారనే నమ్మకము రైతులకుపోయినది. ప్రతి యితర సరకు విషయములోను బ్లాక్ మార్కెటు వ్యాపారం పరిపాటియైనది. అట్టి బ్లాక్ మార్కెటు వల్ల ఆసరకులను ఉత్పత్తిచేసే వారికి గాని కొనుక్కొనే వారికి గాని లాభం లేకపోగా, మధ్యస్థ వ్యాపారస్థుడు లాభాలు మూటగట్టుకొను చున్నాడు. ఈ కారణాలవల్ల నేనుసూచించిన రాజీపద్ధతికి రైతులు అంగీకరించుటలేదు.

ఆంధ్ర రాష్ట్ర ధాన్యోత్పత్తిదారుల మహాసభ గుంటూరు జిల్లాలో జరిగినది. నిన్న నేను ఆ సభకు వెళ్లియుంటిని. ఆ సభకు 10 వేలమంది రైతులకు పైగా హాజరైనారు. ధాన్యం కంట్రోలు పద్ధతులు తొలగింపబడేవరకు నేను చెప్పిన రాజీపద్ధతికి అంగీకరించవలసినదనియు, తిరిగి కంట్రోలు పద్ధతులు వచ్చినందుకు ఆగ్రహించి ఖండించవద్దనియు నేను వారిని ఒప్పించగల్గితిని. కాని రైతులకు గవర్నమెంటు యివ్వవలసిన ధాన్యం ధర విషయములో బస్తా 1 కి రూ 20/లు చొప్పున యివ్వవలెననియు అంతకు తక్కువ అయితే తమకు గిట్టుబాటుకాదనియు రైతులు పట్టుదల వహించిరి. వారు చెప్పిన కారణమేమనగా వ్యవసాయపు ఖర్చులు విపరీతముగా హెచ్చినవి. ధాన్యం ధరలకంటెను అవి ఇంకా హెచ్చుచున్నవి. బస్తా 1-కి రూ. 18 లు కంటె హెచ్చుధర యివ్వవలెనని కోరుటతగదని నేను వాదించగా, వారు చాలా కష్టంమీద ఒప్పుకొన్నారు. ఫ్యాక్టరీల ఆసాములయొక్క బస్తీల ప్రజలయొక్క కోరికలను తృప్తిపరచుటకై యీ కంట్రోలుపద్ధతులమూలంగా కలిగే అనర్థకములనన్నింటిని రైతులకంటగట్టుట చాల అక్రమమనియు అట్టి అక్రమమును ప్రతిఘటించుటకు సత్యాగ్రహమైనను చేయవలెననియు ప్రజలలోసంకల్పబలము నానాటికి హెచ్చుచున్నది. ఈ అసంతృప్తిని కాంగ్రెసు కిసాను సేవకులు అరికట్టజాలకున్నారు. కాబట్టి కేంద్రప్రభుత్వములోను రాష్ట్ర ప్రభుత్వములోను అధికారంవహించిన మంత్రివర్గములకు నేనొక హెచ్చరిక చేయదలచితిని. ఈ కంట్రోలు పద్ధతులవల్లకలిగే అనర్థములను కొంతవరకు ఉపశమింపచేయు నిమిత్తమై ఉత్పత్తి వినియోగదార్లతో కోఆపరేటివు సొసైటీలను గ్రామాలలో ఏర్పాటు చేసినచేతప్ప గ్రామాలలోని ప్రజాకల్లోలము మనలను కబళించివేయగలదు. కిసానుకాంగ్రెసు ప్రతినిధులును కొనుగోలుదార్ల ప్రతినిధులును ప్రభుత్వముతో సన్నిహిత సంబంధంకలిగి వ్యవహరించవలెను.

దేశంలోని బ్లాకుమార్కెటు వ్యాపారాన్ని నిర్మూలించుటకు కిసాను కాంగ్రెసు సభ్యులుకూడా కృషిచేయవలెను. తమ స్వలాభములకుమాత్రమే ఆందోళన చేస్తే చాలదు. గ్రామాలలో ప్రబలియున్న యీ దారుణపరిస్థితులనుగూర్చి నేను వివిధ రాష్ట్రాల ప్రధానమంత్రులకును, కేంద్ర ప్రభుత్వ ఆహారశాఖామంత్రికిని, మన దేశ నాయక ప్రముఖులకును విశదపరచియున్నాను.

# బలీయమైన నౌకాదళావశ్యకత

## రియల్ అడ్మిరల్ హాల్ సూచనలు

కలకత్తా, నవంబరు 21: 'ప్రాచ్యదేశములలో కెల్లా ఒక ప్రధానమైన దేశమనే పేరు ప్రతిష్ఠలను సవ్యంగా కాపాడుకొనవలెనంటే, భారతదేశం స్వీయభద్రతకోసం బలీయమైన నౌకాదళం నిర్మించుకొనుట అత్యవసరము' అని రియర్ అడ్మిరల్ జె. టి. యస్. హాల్ నిన్న సాయంకాలము, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం, రాయల్ ఇండియన్ నౌకాదళోద్యోగుల కిచ్చిన సన్మాన సందర్భములో మాట్లాడుచూ తెలిపెను. ఇప్పుడు కలకత్తా రేవును సందర్శించుచున్న క్రూయిజర్ 'ఢిల్లీ' కిస్నా, సట్లెజ్ స్లూప్‌లు, దళమునకు జె. టి. యస్. హాల్ [illegible] రక్షణోద్యోగుల అధిపతి.

డిస్ట్రాయర్లతోనూ, క్రూయిజర్లతోనూ, విమాన వాహక నౌకలతోనూ, రాయల్ ఇండియన్ నౌకాదళమును సర్వాంగ సమర్థముగా చేయవలెనను ప్లాను ఆలోచనలో నున్నదని, భారత దేశమునకు హెచ్. యమ్. ఐ. యస్. 'ఢిల్లీ' ఆగమనము యీ ప్లానులో తొలిఘట్టం అని హాల్ వెల్లడించెను. రాయల్ ఇండియన్ నౌకాదళములోకెల్లా మొట్టమొదటి పెద్ద యుద్ధనౌక ఢిల్లీ యేనని హాల్ తెలిపెను. తాము దర్శించిన రేవులన్నింటిలోనూ తమకు లభించిన సన్మానము సంతోషదాయకముగనున్నదని హాల్ కృతజ్ఞత వెల్లడించెను.

'ఢిల్లీ' యుద్ధనౌకకు బొంబాయిలో స్వాగతమొసంగుచూ భారతదేశం శాంతికాముకదేశమని, శాంతిని వాంఛించుచున్నప్పటికి, శాంతి విచ్ఛిన్నంకాకుండా కాపాడుటకు బలీయముగానుండుట అత్యవసరమని, భారత ప్రధాని పండిట్ జవహరిలాల్ నెహ్రూ అన్నమాటలను ఉదహరించుచూ, యీ మాటలు, రాజకీయ నేతృత్వమునకు నిదర్శనమని, తాము నెహ్రూ మాటలతో ఏకీభవించుచున్నామని హాల్ అనెను.

"సముద్రముమీదుగా వచ్చే దాడులను, దండయాత్రలను నిరోధించుట, కోస్తాలోనూ, సముద్రములమీదవాణిజ్యమార్గములకుఅవాంతరం కలుగకుండా కాపాడుట- యుద్ధకాలంలో నౌకాదళం చేయవలసిన ముఖ్యమైన పనులు. శత్రుదురాక్రమణ నిరోధమునకు ఈ రెండు పనులు ముఖ్యము.

ఆఫ్రికానుండి ఆస్ట్రేలియా వరకు వ్యాపించి ఉన్న హిందూమహాసముద్రం యొక్క విస్తీర్ణమును సుదీర్ఘమైన భారత దేశ కోస్తాను చూచేయెడల, భారతదేశ భద్రతకు, ప్రాచ్యదేశములలో కెల్లా ఒక ముఖ్యదేశమనే పేరు ప్రతిష్ఠలను సవ్యముగా కాపాడుకొనుటకు బలీయమైన నౌకాదళం ఉండుట అత్యవసరమనే సంగతి అందరూ అంగీకరించి తీరెదరు.

శాంతిసమయంలో నిర్మించుకొనకపోతే యుద్ధకాలంలో బలీయమైన నౌకాదళం ఉండుట దుస్తరం. మామూలుగా నౌకాదళం నిర్మించుటకు చాలా ఏండ్లు పట్టును. "ప్రజల సద్భావము, నౌకాదళం యెడల ప్రజల ఆసక్తి ఉన్నట్లయితే, సమర్థులైన వారు తగినంతగా నౌకాదళంలో చేరినట్లయితేను; కొద్దికాలంలోనే మన లక్ష్యము సాధ్యంకాగలదు అని హాల్ చెప్పెను.

## పోలవరం తాలూకా కాంగ్రెస్ ఎన్నికలు

పోలవరం తాలూకా కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం 10వ తేదీన దిప్పకాయలపాడులో జరిగెను. 26 గురు సభ్యులు హాజరైరి. అధ్యక్షుడు మంత్రిప్రగడ పేరాజురావుగారు, సభ్యుల సంతకములు, రుసుములు తీసికొన్న తర్వాత, జిల్లా కాంగ్రెస్ సంఘమునకు సభ్యుని ఎన్నుకొను విషయంలో బాలెట్ తీసికొనవలసిన సందర్భమున, సభ వాయిదా వేసి మరి 8 మంది సభ్యులతో వెడలిపోయిరి. మిగిలిన 17మంది ఉపాధ్యక్షుడు ఇస్మాయిల్ సాహెబ్ అధ్యక్షతను సమావేశమై పి. వి. రంగాచారిగారిని జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యుడుగా ఎన్నుకొనిరి. ఈ సమావేశంలో రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడు పుసులూరి కోదండరామయ్యగారు, జిల్లా కాంగ్రెస్ సభ్యులు కొందరు పాల్గొనిరి. అధ్యక్షుని చర్యకు అసమ్మతి తెల్పుచు తీర్మానించిరి. వారిమీద విశ్వాసరాహిత్య తీర్మానము ఉపపాదించుటకు 17 గురి సంతకాలతో నోటీసిచ్చిరి. ఈ సమావేశముల సంగతి వివరముగ జిల్లా, రాష్ట్ర, అఖిలభారత కాంగ్రెస్ సంఘములకు తెలియచేయబడెను.

## కొత్త సన్యాసయ్య శ్రేష్ఠిగారి షష్టిపూర్తి

అనకాపల్లి, నవంబరు 20: శ్రీ కొత్తపల్లి సన్యాసయ్యశ్రేష్ఠిగారి షష్టిపూర్తి ఉత్సవము ఈ కార్తికశుద్ధ త్రయోదశి మొదలు మూడుదినములు జరిగెను. పురాణ హరికథా కాలక్షేపములు, కవి, పండితుల కావ్యపఠనోపన్యాసములు, పాటకచేరీలు జరిగెను.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 23:

వేరుసెనగ: (581 సౌ 1-కి ఎప్పు కోస్తాగిడ్డంగులు) మెషీన్(సేల్సుటాక్సుతో సహా) బజారు(పాతది) రు. 150-0-0
ఆఫీసువద్ద రు. 151-0-0
వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (టాల్ కోల్) (సేల్సుటాక్సుతోసహా) రు. 312-0-0
(గ్యారంటీ) 314-0-0
ఆముదం బజారుడెలివరీ ఎక్స్‌పెల్లర్ వర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 360-0-0
కొంకాయనూనె (39 పౌను గల డబ్బా) రు. 83-8-9

బంగారు-వెండి జెటి మధ్యాహ్నం 1 గంటకు పవను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 75-14-0 పెట్లా బంగారు తులం 113-8-0 మూసబంగారు 111-12-0. సిమవెండి తులం 100-కి (రెడి) 175-8-0 వెండి తులం 1-12-9.



Edited, Printed & Published by S. Sambhu Prasadat the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G T. Madras.